శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమతే నిగమాంతమహాదేశికాయ నమః

# శ్రీదేశికస్తోత్రమాలా – 2

# న్యాసవింశతి



వీరరాఘవ స్వామి, తిరువళ్ళూరు




'పండితరత్న'

డా॥ ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అప్పాగ శింగరాచార్యులు


సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు

# న్యాసవింశతి

**శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కికకేసరీ,**

**వేదాంతాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది.**

వేదాలు, స్మృతులు, ఆళ్వారుల సూక్తులు, ఆచార్యుల సూక్తులు మొదలైనవానిలోను, శ్రీరహస్యత్రయసారం మొదలైన గ్రంథాలలోనూ శరణాగతి అనే ప్రపత్తి వివరింపబడింది. ఇదే న్యాసవిద్య అని చెప్పబడుతున్నది. ఇందులోని అంశాలను, పెద్దల అభిప్రాయాన్ని అనుసరించి న్యాసవింశతి అనే గ్రంథం ద్వారా వ్యక్తం చేయాలని దేశికులు భావించారు. తత్వాన్ని గూర్చిన విశదమైన జ్ఞానాన్ని పొందినప్పుడే ప్రపత్తిని చేయడానికి తగిన యోగ్యత ఉంటుంది కనుక. ఆ జ్ఞానాన్ని పొందడానికి ఆచార్యుని మొదట జీవుడు ఆశ్రయించాలి అనే విషయాన్ని, ఆ ఆచార్యులకు ఉండవలసిన 14 గుణాలను మొదట తెలియజేస్తూ దేశికులు ఈ మొదటి శ్లోకాన్ని రచిస్తున్నారు.

*1) సిద్ధం సత్సంప్రదాయే స్థిరధియ మనఘం శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం*
*సత్త్వస్థం సత్యవాచం సమయనియతయా సాధువృత్త్యా సమేతమ్!*
*డంభాసూయాదిముక్తం జితవిషయగణం దీర్ఘబంధుం దయాళుం*
*స్ఖాలిత్యే శాసితారం స్వపరహితపరం దేశికం భూష్ణు రీప్సేత్ //*

ఉన్నత గతిని పొందగోరినవాడు మొదట సదాచార్యుని ఆశ్రయించాలి. ఆ ఆచార్యునకు ఉండవలసిన లక్షణాలు ఏమిటి?అంటే,

సదాచార్య లక్షణాలు

1) ఆళ్వారులు, నాథమునులు మొదలైన ఆచార్యుల ద్వారా వచ్చిన గొప్ప సంప్రదాయంలో సిద్ధిని కలిగి ఉండాలి.

2) ఇతరులు తమ కుయుక్తులతో తన మనసును మార్చాలని ప్రయత్నం చేసినా చలించని, బలమైన మనసును కలిగినవాడై ఉండాలి,

3) ఏ విధమైన దోషాన్ని లేనివాడై ఉండాలి,

4) వేదాలను చక్కగా చదివి తెలిసినవాడై ఉండాలి,

5) భగవంతుని విషయంలో స్థిరమైన భక్తిని కలిగి ఉండాలి,

6) సత్వ గుణాన్ని కలవాడై ఉండాలి,

7) వంచన మొదలైనవానిని కలిగి ఉండకుండా నిజాన్నే పలకాలి.

8) ఆయా కాలాలకు తగినది, ధర్మాన్ని తెలిసిన పెద్దలచే అంగీకరింప బడినది అయిన గొప్ప అనుష్ఠానాన్ని కలవాడై ఉండాలి,

9) ఇతరుల కోసం వేషాన్ని ప్రదర్శించడం, అసూయను కలిగి ఉండడం మొదలైన చెడ్డ గుణాలు లేనివాడై ఉండాలి, 10) ఇంద్రియనిగ్రహాన్ని కలవాడై ఉండాలి,

11) ఇహలోకంలో మంచి మార్గాన్ని చూపి, పరలోకంలో ఉన్నత గతిని పొందడానికి సహాయం చేసేవాడై ఉండాలి,

12) దయను చూపించే వాడై ఉండాలి,

13) శిష్యుడు తప్పు చేస్తే దానిని సరి చేసి దిద్దుబాటు చేసేవాడై ఉండాలి,

14) తనకు, ఇతరులకు మంచినే భావించేవాడై ఉండాలి.

యథార్థమైన జ్ఞానాన్ని పొందాలని కోరిన శిష్యుడు ఒక సదాచార్యుని ఆశ్రయిస్తున్నాడు. దీనిని శాస్త్రం విధించనక్కరలేదు. అయినా, ఒకడు ఒక ఆచార్యుని ఆశ్రయించాలని కోరితే, అతడు ఈ లక్షణాలను కలిగినవాడైన ఆచార్యుని ఆశ్రయించాలి అని మాత్రం విధించడంలో శాస్త్రం దృష్టి కలిగి ఉన్నది.

## 2) భగవానుని వలె ఆచార్యుని ఆరాధించడానికి కల కారణాలు

*అజ్ఞానధ్వాంతరోధా దఘపరిహరణా దాత్మసామ్యావహత్వాత్*

*జన్మప్రధ్వంసిజన్మప్రదగరిమతయా దివ్యదృష్టి ప్రభావాత్ /*

*నిష్ప్రత్యూహానృశంస్యాత్ని యతరసతయా*

*నిత్యశేషిత్వయోగాత్*

*ఆచార్యః సద్భి రప్రత్యుపకరణధియా దేవవత్ స్యాదుపాస్యః //*

గడచిన శ్లోకంలో జ్ఞానాన్ని సంపాదించడానికి, మోక్షానికి దారి చూపడానికి ఒక సదాచార్యుని ఆశ్రయించాలి అని తెలిసిన తర్వాత, ఆ ఆచార్యుని ఆరాధించే క్రమాన్ని ఈ శ్లోకం తెలుపుతున్నది. ఈ శ్లోకంలో చెప్పబడే కారణాలు భగవంతునకు, ఆచార్యునకు ఇద్దరికీ అన్వయిస్తాయి.

మంచి గుణాన్ని కలిగిన శిష్యుడు ఆచార్యుని భగవంతుని వలె ఆరాధించాలి. ఆ విధంగా తాను పూజించడం ఆ ఆచార్యుడు

చేసిన ఉపకారానికి ప్రత్యుపకారం అని భావించరాదు. ఆచార్యునకు ప్రత్యుపకారం చేయడం ఎవరికీ ఏ విధంగాను సాధ్యం కాదు. ఈ విధంగా భగవంతునివలే ఆచార్యుని ఆరాధించడానికి ఎన్నో కారణాలు ఉన్నాయి. భగవంతుడు చేసే ఉపకారాలను అన్నిటినీ ఆచార్యుడు అంతకంటే ఎక్కువగా శిష్యునకు చేస్తాడు. ఆ ఉపకారాలు ఏమిటి? అంటే,

1) భగవంతుడు జీవుల జ్ఞానాన్ని పోగొడుతున్నాడు. ఆచార్యుడు కూడా శిష్యునకు మంచి ఉపదేశాలను చేసి అజ్ఞానాన్ని లేకుండా చేస్తున్నాడు.

2) భగవంతుడు జీవుల పాపాన్ని పోగొడుతున్నాడు. ఆచార్యుడు కూడా శిష్యులు ఎటువంటి పాపులు అయినా, వారిని సంస్కరించి, వారి పాపాన్ని తీరుస్తున్నాడు.

3) భగవంతుడు శ్రీ వైకుంఠాన్ని చేరే జీవులను ఆనందానుభవం మొదలైనవానిలో తనతో సమానంగా ఉండేటట్లు చేస్తున్నాడు. ఆచార్యుడు కూడా శిష్యులను జ్ఞానం, గుణాలు, ఆచరణ మొదలైన వాని లో తనతో సమానంగా ఉండేటట్లు చేస్తున్నాడు.

4) భగవంతుడు తనను ఆశ్రయించిన జీవులకు సంసారంలోని జన్మను పోగొట్టి మోక్షాన్ని పొందడం అనే నూతనమైన జన్మను కలిగిస్తున్నాడు. ఆచార్యుడు కూడా శిష్యుని తల్లి కడుపులో నుండి పుట్టడంవల్ల కలిగిన జన్మను పోగొట్టి, తత్వజ్ఞానాన్ని కలిగించి, గొప్పదైన జ్ఞాన జన్మను కలిగిస్తున్నాడు.

5) భగవంతుడు జీవులను తన దివ్య కటాక్షంతో సత్వగుణం కలిగినవారినిగా చేసి, మోక్షంలో కోరికను కలవారినిగా చేస్తాడు. ఆచార్యుడు కూడా శిష్యులు మొదట ఎటువంటి చెడ్డ గుణాలు కలిగిన వారు అయినా వారిని చల్లగా చూచి, మంచి ఉపదేశాలతో సద్గతిని పొందేటట్లు చేస్తాడు.

6) భగవంతుని కరుణ ఎంత తక్కువవారి విషయంలో అయినా ఏ అడ్డు లేకుండా ప్రసరిస్తుంది. ఆచార్యుని దయ కూడా తనను ఆశ్రయించినవారి ఈ విషయంలో, వారు ఎటువంటి వారైనా, ఏ అడ్డు లేకుండా ప్రసరిస్తుంది.

7) భగవంతుడు భక్తులకు ఎన్నాళ్ళు అనుభవించినప్పటికీ తృప్తి కలిగించని అమృతం వంటివాడు. ఆచార్యుడు కూడా శిష్యులచే ఈ లోకంలో, పరలోకంలో కూడా అన్ని దశల్లోనూ అనుభవింపబడే అమృతంవంటివాడు.

8) భగవంతుడు జీవులకు ఎల్లప్పుడు స్వామియచ, వారితో విడదీయరాని సంబంధాన్ని కలిగి ఉన్నాడు. ఆ విధంగానే ఆచార్యుడు కూడా శిష్యులకు శేషి గనుక వారితో నిత్య సంబంధాన్ని కలిగి ఉంటాడు.

ఈ విధంగా పలు విధాలుగా భగవంతునకు సమానమై ఉన్నందున ఆచార్యుని విషయంలో శిష్యులు ఎల్లప్పుడు, భగవంతుని విషయంలో వలె, భక్తిని కలిగి ఉండాలి. బ్రహ్మ విద్యను ఉపదేశించి గొప్ప ఉపకారం చేసే ఆచార్యునకు చేయగలిగిన ప్రత్యుపకారం అనేది ఏదీ లేదు. ఈ నిజాన్ని తెలిసికొని శిష్యులు

తమ ఆచార్యులకు చేసే చిన్న కైంకర్యం తమ ప్రేమకు, శక్తికి తగినట్లు అణువులె చాలా చిన్నదే తప్ప, తగిన ప్రత్యుపకారం కాబోదు —అనే భావనతోనే వర్తించాలి.

### 3) శిష్య లక్షణం ఆచార్యుని కర్తవ్యం

*సద్బుద్ధిః సాధుసేవీ సముచితచరిత స్తత్త్వబోధాభిలాషీ*
*శుశ్రూషు స్త్యక్తమానః ప్రణిపతనపరః ప్రశ్న కాలప్రతీక్షః /*
*శాంతో దాంతోఽనసూయుః శరణ ముపగతః శాస్త్రవిశ్వాసశాలీ*
*శిష్యః ప్రాప్తః పరీక్షాం కృతవిదభిమతం తత్త్వతః శిక్షణీయః //*

ఈ శ్లోకంలో —శిష్యునకు ఉండవలసిన లక్షణాలను తెలిపి, ఆ లక్షణాల ప్రకారం చక్కగా వర్తించే శిష్యుని విషయంలో ఆచార్యుడు చేయవలసిన కర్తవ్యాన్ని, శాస్త్రం తెలిసిన రీతిలో, దేశికులు తెలియజేస్తున్నారు.

శిష్యుడు ఈ క్రింది లక్షణాలు కలిగి ఉండాలి.

1) మంచి భక్తిని కలవాడై ఉండాలి.

2) భగవద్ భక్తులతో కలసిమెలసి ఉండే స్వభావాన్ని కలవాడై ఉండాలి.

3) శాస్త్రాలలో చెప్పబడిన విధంగా మంచి ఈ విధంగా తగిన ప్రవర్తనను కలవాడై, తనకు విధింపబడిన కార్యాలను తప్పకుండా చేసేవాడై ఉండాలి.

4) తత్వం, ఉపాయం, ఫలం— అనే ఈ మూడిటినీ గూర్చి తెలుసుకోవాలనే ఆశ కలవాడై ఉండాలి.

5) ఆచార్య సేవను చేసేవాడై ఉండాలి.

6) అహంకారాన్ని విడిచిపెట్టాలి,

7) ఆచార్యుని నమస్కరించి సేవ చేయాలి,

8) తనకు కలిగే సందేహాలను అడిగి తెలుసుకోవడానికి ఆచార్యున ₹కు తగిన సమయంకోసం ఎదురు చూడాలి,

9) తన బాహ్యేంద్రియాలను లౌకిక విషయాలలో ఆకర్షింపబడకుండా చూసుకోవాలి.

10) మనసును చెడ్డ మార్గంలో నడవక ఉండేటట్లు జాగ్రత్తపడాలి,

11) ఇతరుల గొప్ప తనంలో అసూయను పొందకుండా, వారి గుణాలలో లోపాలను ఎంచకుండా ఉండాలి.

12) ఆచార్యుని చరణాలే శరణంగా ఆశ్రయించాలి.

13) ఆచార్యుడు ఉపదేశం చేసే శాస్త్రార్థాలలో పూర్తిగా నమ్మకాన్ని కలిగి ఉండాలి.

14) ఆచార్యుడు తన యోగ్యతను తెలిసి కోవడానికి చేసే పరీక్షకు అంగీకరించాలి.

15) ఆచార్యుడు చేసిన ఉపకారాన్ని ఏనాడు మరువకుండా ఎల్లప్పుడు గుర్తు పెట్టుకోవాలి.

ఇటువంటి మంచి గుణాలను కల శిష్యునకు తగిన సంప్రదాయార్థాలను ఏ వంచన లేకుండా అతని కోరికకు, తన అభిప్రాయానికి తగినట్లు ఉపదేశించడం ఆచార్యుని కర్తవ్యం.

## 4) ఆచార్యుడు శిష్యునకు చేసే ముఖ్యమైన ఉపదేశం

*స్వాధీనాశేషసత్తాస్థితియతనఫలం విద్ధి లక్ష్మీశ మేకం*
*ప్రాప్యం నాన్యం ప్రతీయా న చ శరణతయా కంచిదన్యం వృణీయాః |*
*ఏతస్మాదేవ పుంసాం భయ మితరదపి ప్రేక్ష్య మోక్షీధ స్తదాజ్ఞామ్*
*ఇత్యేకాంతోపదేశః ప్రథమ మిహ గురో రేకచిత్తేన ధార్యః ||*

మోక్షాన్ని పొందాలని భావించి తనను ఆశ్రయించిన శిష్యునకు ఆచార్యుడు ఉపదేశించవలసిన తిరు మంత్రం, ద్వయం, చరమ శ్లోకం అనే మూడు రహస్యాలలో వ్యక్తమయ్యే అనేక విధాలైన అర్థాలలో ముఖ్యమైన అర్థం,, దానిని శిష్యుడు ప్రతి దినం అనుసంధించాలనే విషయం ఈ శ్లోకం ద్వారా వ్యక్తం చేయబడుతున్నది.

మొదట ఆచార్యుడు ఈ విధంగా ఉపదేశిస్తాడు. చేతనం, అచేతనం అనే అన్ని వస్తువుల స్వరూపస్థితి ప్రవృత్తులు అన్ని లక్ష్మీ నాథుడైన శ్రీమన్నారాయణుని అధీనంలోనే ఉన్నాయి అని గ్రహించు. నీవు అతనిని మాత్రమే పొందవలసిన ఫలమని గ్రహించు, వేరు ఎవ్వరిని పొందదగిన ప్రయోజనంగా భభావించకు. ఆ ప్రయోజనాన్ని పొందడానికి భగవంతుడే ఉపాయం అని తెలిసికొని,. అతనిని శరణు పొందు. వేరు ఎవరిని ఉపాయంగా భావించి శరణు పొందకు. జీవులకు సంసార బంధం అనే భయం, ఆ భయం లేకపోవడం అనే రెండు భగవంతుని వల్ల మాత్రమే ఏర్పడుతున్నవి

అని చక్కగా తెలుసుకో. అందువల్ల ఆ భగవంతుని అజ్ఞారూపాలైన శాస్త్రాలలో చెప్పబడిన కర్మలను చేయడంలో పొరపాటు పడకు.

ఆచార్యుడు ఏకాంతంలో మొదట ఈ విధంగా చేసిన స్థిరమైన ఉపదేశాన్ని శిష్యుడు ఏకాగ్రతను కలిగిన మనసుతో గ్రహించి, దానిని ఎల్లప్పుడూ భావిస్తూ ఉండాలి.

## 5) భక్తిప్రపత్తుల యోగ్యత, నియమం

*మోక్షోపాయార్హతైవం భవతి భవభృతాం కస్యచిత్ క్వాపి కాలే*
*తద్వద్భక్తిప్రపత్త్యో రధికృతినియమ స్తాదృశా స్యాన్ని యత్యా /*
*శక్తాశక్తాదితత్తత్పురుషవిషయతః స్థాప్యతే తద్వ్యవస్థా*
*యచ్చాపహ స్తద్వికల్పః సమ ఇతి కతిచిత్ తత్ఫలస్యావిశేషాత్ //*

ఇంతకుముందు చేసిన ఆచార్య ఉపదేశంలో చక్కని జ్ఞానాన్ని పొందిన జీవునకు మోక్షాన్ని పొందడానికి ఉపాయంగా విధింపబడిన భక్తి ప్రపత్తులకు కల యోగ్యతలోని నియమాన్ని ఈ శ్లోకం తెలుపుతున్నది.

ఈ లోకంలో సంసార బంధంలో చిక్కుకొని బాధపడే జీవులు అనేకులు. వారు అందరూ మోక్షం కోసం ఉపాయాన్ని ఆచరించడానికి ముందుకు వస్తున్నారా? లేదు కదా! ఇంతకుముందు శ్లోకంలో చెప్పబడిన ఉపదేశాన్ని ఆచార్యుని సన్నిధిలో విని, జ్ఞానాన్ని పొందినవానికి మోక్షాన్ని పొందాలనే ఆశ, అందుకోసం ఉపాయాన్ని ఆచరించాలి అనే భావం కలుగుతుంది. ఇటువంటి భావన ఏదో ఒక కాలంలో కలుగుతుంది. జీవుని పుణ్యం

పరిపక్వం అయిన సమయంలోనే ఆచార్యుని ఉపదేశం పొందే అవకాశం, ఆ తర్వాత మోక్షంలో కోరిక, దానికి తగిన ఉపాయాన్ని ఆచరించాలి అనే ప్రయత్నం అన్ని కలుగుతాయి. మోక్షాన్ని పొందడానికి తగిన సాధనాలు రెండే ఉన్నాయి. అవి భక్తి, ప్రపత్తి అనేవి. వాటిలో, భక్తిని చేయడానికి కొందరు, ప్రపత్తిని చేయడానికి ఇంకొందరు యోగ్యతను కలిగి ఉన్నారు విధింపబడిన ఆ యా ఉపాయాలను చేయడానికి తగిన యోగ్యత కలగడం కూడా వారి వారి పుణ్యాన్ని అనుసరించి ఏర్పడుతుంది. ఆ యోగ్యత వివరం ఏమంటే భక్తియోగం చేయడానికి తగిన శక్తి కలవాడు భక్తి యోగాన్ని చేయాలి ఆ విధంగా శక్తి లేనివాడు ప్రపత్తిని చేయాలి అనే విధంగా ఆయా జీవుల శక్తిని బట్టి ఆ నియమం శాస్త్రాలలో విధించబడింది.

అయితే కొందరు ఈ రెండు ఉపాయాలు సమానాలే అని, ఎవరు ఏ ఉపాయాన్ని చేయాలని అనుకుంటే వారు ఆ ఉపాయాన్ని చేయవచ్చునని పలుకుతున్నారు. అది ఏవిధంగా తగినది? అని అంటే, వారి భావం వేరే విధంగా ఉండవచ్చు. వారి వారి శక్తికి తగినట్లు ఉపాయంలో యోగ్యత నియమింపబడినా, రెండు విధాలైన ఉపాయాలతో వారు వారు పొందే మోక్షమనే ఫలం ఒక్కటే కనుక, దానిని మనసులో పెట్టుకొని రెండు ఉపాయాలు సమానమని వారు చెప్పి ఉండవచ్చు.

## 6) ప్రపత్తి యొక్క గొప్పతనం

*సానుక్రోశే సమర్థే ప్రపదన మృషిభిః స్మ ర్యతేఽ భీష్టసిద్ధ్యై*
*లోకేఽప్యేతత్ ప్రసిద్ధం న చ విమతిరిహ ప్రేక్ష్యతే క్వాపి తంత్రే/*
*తస్మా త్ కైముత్యసిద్ధం భగవతి తు భరన్యాసవిద్యానుభావం*
*ధర్మ స్థేయాశ్చ పూర్వే స్వకృతిషు బహుధా స్థాపయాంచక్రు రేవమ్ //*

ఇంతకుముందు కఠినమైన భక్తి యోగాన్ని కానీ, సులభమైన ప్రపత్తిని కాని చేయవచ్చు అని పలికి, ఈ నిర్ణయం కూడా, శక్తి కలిగిన వాడు భక్తి యోగాన్ని శక్తి లేనివాడు ప్రపత్తి యోగాన్ని చేయాలి అనే విభాగాన్ని దృష్టిలో పెట్టుకొని చేయబడిందని చెప్పబడింది. అయినా. ప్రపత్తి మహిమ విషయంలో సందేహాన్ని కల అల్ప జ్ఞానులకు నమ్మకాన్ని కలిగించడం కోసం మళ్ళీ దాని గొప్పతనం చెప్పబడుతున్నది.

తాము కోరిన ఫలాన్ని పొందడం కోసం లోకంలోనివారు కరుణను శక్తిని కలిగిన ఇతరుల దగ్గర శరణు పొందుతున్నారు ఈ విషయాన్ని మునులు తాము రచించిన గ్రంథాలలో తెలియజేశారు ఈ విషయం లోకంలో అందరికీ తెలిసినదే. సుగ్రీవుడు, కాకాసురుడు, విభీషణుడు, ద్రౌపది, గజేంద్రుడు, సుముఖుడు, త్రిశంకువు, శునశ్శేపుడు మొదలైన వారి చరిత్రలు చూచినప్పుడు వారంతా శరణు పొంది తాము కోరిన ప్రయోజనాన్ని పొందారని చక్కగా తెలుస్తున్నది ఈ విధంగా శరణు పొంది ప్రయోజనాన్ని పొందే క్రమాన్ని ఏ శాస్త్రము వ్యతిరేకించి పలికినట్లు తెలియదు. లోకంలో

తక్కువ కరుణను. పరిమితమైన శక్తిని కల సాధారణ మానవులు దగ్గర శరణు పొందడమే నిష్ఫలం కాకండా ప్రయోజనాన్ని కలిగించినప్పుడు, కరుణను, శక్తిని పూర్ణంగా కలిగిన భగవంతుని విషయంలో చేసే శరణాగతి గొప్ప ఫలాన్ని ఇస్తుంది అనే విషయాన్ని ప్రత్యేకించి చెప్పవలసిన పని ఉన్నదా? ధర్మంలో సందేహం కలిగినప్పుడు దానిని నిర్ణయించి చెప్పగలిగిన శ్రీయామునులు మొదలైన పూర్వాచార్యులు కూడా ఋతమ గ్రంధాలలో అనేక విధాలైన ఆధారాలతో ఈ విషయాన్ని నిరూపించి స్థాపించారు.

## 7) మహా విశ్వాసంలోని ఆవశ్యకత

*శాస్త్రప్రామాణ్యవేదీ నను విధివిషయే నిర్వ్యశంకోఽధికారీ*

*విశ్వాసస్యాంగభావే పున రిహ విదుషా కిం మహత్త్వం ప్రసాధ్యమ్ /*

*మైవం, ఘోరాపరాధైః సపది గురుఫలే న్యాసమాత్రేణ లభ్యే*

*శంకా పార్థిగ్రహార్హా శమయితు ముచితా హేతుభి స్తత్తదర్హైః //*

ఈ సందర్భంలో ఒక ప్రశ్న కలుగుతున్నది. శాస్త్రాలు అనేక విధాలైన కర్మలను చేయాలని విధిస్తున్నాయి. మనకు శాస్త్రాలు ప్రమాణం అనే నమ్మకం కలిగినవాడై ఇతరులు పలికే కుయుక్తులతో ఆ నిర్ణయాన్ని సడలని వాడై ఉండే మానవుడు శాస్త్రం విధించే కర్మలను చేయడానికి తగిన యోగ్యత కలవాడు అవుతున్నాడు అనే విషయంలో ఏ సందేహం లేదు. అందువల్ల శాస్త్రం పలికిన అన్ని విషయాల్లోనూ నమ్మకం కలిగి ఉండాలి కనుక ప్రపత్తి లో కూడా నమ్మకం కలిగి ఉండడం ఆవశ్యకం అనేది చెప్పనక్కరలేదు. ఆ

విధంగా ఉండగా, ప్రపత్తికి లక్షణాన్ని తెలిపే వాక్యాలలో నమ్మకం మాత్రమే కాకుండా, అధికమైన నమ్మకం అని అర్థం ఇచ్చే మహా విశ్వాసం అనేది ప్రపత్తిలో అంగ మని పలకడం ఎందుకోసం? అనేది ఆ సందేహం.

దీనికి సమాధానం ఏమంటే –లెక్కలేనన్ని పాపాలను చేసిన జీవులు భగవంతుని వద్ద క్షణకాలంలో చాలా సులభంగా ఒక భరన్యాసాన్ని చేసి, దాని ఫలితంగా చాలా గొప్ప ఫలమైన మోక్షాన్ని పొందవలసినవారై ఉన్నారు. అప్పుడు, వీరికి భగవంతుడు చిన్న ఉపాయంతో చాలా పెద్ద ఫలాన్ని ఏ విధంగా ఇస్తాడు అనే సందేహం కలగడం సహజం గదా ముందు పెట్టిన కాదు వెనుకకు జాపి అడ్డం పెట్టినట్లుగా, ఆ సందేహాలు ప్రపత్తిని చేయడానికి ముందుకు వచ్చే జీవులను ఆ విధంగా ప్రపత్తిని చేయనీయకుండా అడ్డుపడతాయి అప్పుడు ఆ సందేహాలను తీర్చగలిగిన యుక్తులను ప్రస్తావించి పలికి సందేహాన్ని తీర్చాలి. రక్షకుడైన భగవంతుని గుణాలు మొదలైనవాని గొప్పతనాన్ని చక్కగా చూచినట్లయితే ఇంతకుముందు ఏర్పడిన సందేహాలు అన్ని తీరిపోతాయి.

ఇప్పుడు ప్రస్తావించ బోయే ఐదు విషయాలను చక్కగా తెలిసికొన్నవానికి ప్రపతి విషయంలో చాలా ముఖ్యమైన అంగంగా చెప్పబడే మహా విశ్వాసమనే స్థిరమైన నమ్మిక చాలా గొప్పది అని తెలుస్తుంది. ఈ స్థిరమైన నమ్మిక శాస్త్రాలు విధించిన అన్ని

విషయాలలోనూ సామాన్యంగా ఉండవలసిన నమ్మిక వంటిది కాదు ప్రత్యేకమైనది. మహా విశ్వాసం అనే పేరు కలిగినది ఇది ప్రపత్తికి ముఖ్యమైన అంగం.

1) భగవంతుడు సర్వజ్ఞుడు. సర్వశక్తి. అందువల్ల అంతులేని అపరాధాలను చేసిన జీవునకు దగ్గరకు చేరడానికి సాధ్యం కాని వాడు. అయినా, ఆ జీవుని కోసం చాలా ప్రేమతో పలికే లక్ష్మీదేవి కాదనడానికి వీలులేని మాటలతో ఆ చేతనుని తప్పులను అన్నిటినీ భగవంతుడు క్షమించేటట్లు చేస్తుంది. అందువల్ల భగవంతుడు దరి చేరడానికి వీలైన వాడే.

2) భగవంతుడు జీవుడు చేసిన కర్మలకు తగిన ఫలితాన్ని ఇస్తాడు. జీవుడు చాలా అపరాధాలను చేసినవాడే అయినా, అతడు చేసే ప్రపత్తికి వశమైన భగవంతుడు తనకు జీవునకు మధ్య ఉండే, కాదనడానికి వీలు లేని సంబంధాన్ని దృష్టిలో పెట్టుకొని జీవునకు గొప్ప ఫలాన్ని అనుగ్రహిస్తాడు.

3) భగవంతుడు తాను కోరి పొందలేని విషయం అనేది ఏదీ లేదు. అతడు ఇతరులు చేసే ఉపకారాన్ని ఎదురు చూడవలసిన అవసరం లేదు అయినా, తన సహజమైన కరుణతో జీవుడు చేసే చిన్న కార్యాన్నికూడా తనకు చాలా గొప్ప ఉపకారంగా భావించి. చాలా కృతజ్ఞతతో జీవునకు ఫలాన్ని ఇస్తాడు.

4) భగవంతుడు అన్య దేవతలవలె త్వరగా ఫలాన్ని ఇవ్వడు అయితే మిగిలిన ఫలాలను చాలా ఆలస్యంగా

ఇచ్చినప్పటికీ, ప్రపత్తి చేసినవాని విషయంలో ఇక ఏ విధమైన ఇంకొక సహాయాన్ని ఎదురు చూడకుండా తన సంకల్పంతోనే జీవుడు కోరే కాలంలోనే ఫలాన్ని ఇస్తాడు.

5) భగవంతుడు తనతో సాటి వచ్చేవాడు, తన కంటే మించినవాడు ఎవడు లేకపోయినా, తన వద్దకు వచ్చి ఆశ్రయించినవాని విషయంలో ఏ హెచ్చుతగ్గులను ఏమి చూడకుండా, తనకు గల స్వాతంత్ర్యం మొదలైన గుణాలతో జీవుని ప్రయోజనాన్ని తన ప్రయోజనం గా భావించి ఫలాన్ని ఇస్తాడు.

ఈ విషయాలను సదాచార్యుని కటాక్షంతో బాగా తెలిసికొంటే తప్ప మహా విశ్వాసం అనేది అంత సులభంగా కలగదు.

**8) మంత్రం ప్రపత్తి ద్వారానే ఫలాన్ని ఇస్తుంది**

*నేహాభిక్రాంతినాశో న చ విహతి రిహ ప్రత్యవాయో భవేదితి*

*ఉక్తం కైముత్యనీత్యా ప్రపదనవిషయే యోజితం శాస్త్రవిద్భిః /*

*తస్మాత్ క్షేత్రే తదర్హే సువిదితసమయై ర్దేశికైః సమ్యగుప్తం*

*మంత్రాఖ్యం ముక్తిబీజం పరిణతివశతః కల్పతే మత్ఫలాయ//*

ఇప్పుడు ఇంకొక సందేహం కలుగవచ్చు. భక్తి యోగం కంటే ప్రపత్తిని చేయడం చాలా సులభం అనేది వాస్తవమే. అయినా, మహా విశ్వాసం అనే చాలా స్థిరమైన నమ్మకం ప్రపత్తికి ముఖ్యమైన అంగంగా చెప్పబడుతున్నది కదా. అటువంటి విశ్వాసం కలగడం చాలా కఠినమైనదే. అందువల్ల దానిని ముఖ్యమైన అంగంగా కల

ప్రపత్తి.. కూడా చాలా కఠినంగానే కదా అవుతున్నది దానిని చేయడం చేయడానికి ఎందుకు కష్టపడాలి కొన్ని ప్రమాణ వచనాలకు కొందరు పెద్దలు చూపి చెప్పే దానినిబట్టి ప్రపత్తి మంత్రమైనా మొదలైన వానిని ఒకసారి ఉచ్చరించి అంతమాత్రం తోనే మోక్షాన్ని ఆచరించి అంతమాత్రం తోనే మోక్షాన్ని పొందవచ్చు కదా అనేది ఆ సందేహం.

**దీనికి సమాధానం ఏమంటే –**

గీతలో కర్మయోగాన్ని వివరించే సందర్భంలో వేరు ఏ ప్రయోజనాన్ని కోరకుండా మోక్షాన్నే ఫలంగా కోరి దానికోసం తగిన సాధనమైనభక్తియోగాన్ని, దానికి కావలసిన జ్ఞానయోగం, ఆత్మసాక్షాత్కారం అనే వీటిని పొందడం కోసం కర్మయోగాన్ని వేయడం ఆరంభించినవాడు ఒకసారి దానిని పూర్తిగా చేసి ముగించే లేక మధ్యలో దానిని విడచి పెట్టవచ్చు. . అయినా, అది వ్యర్థం కాదు, మధ్యలో నిలిపిన పాపం రాదని, తరువాత జన్మలో కాని, లేక, వేరే ఒక సమయంలో కానీ పూర్తి చేసినట్లయితే అది ఫలాన్ని ఇస్తుందని తెలుపబడింది. కర్మ యోగానికే ఇటువంటి గొప్పతనం ఉన్నప్పుడు, అంతకంటే చాలా ఉన్నతమైనది ఐన ప్రపత్తికి ఈ విషయంలో ఇటువంటి గొప్ప తనం ఉంటుందని చెప్పవలసి ఉన్నదా ? అనే ఈ విధంగా శాస్త్రాలను చక్కగా అధ్యయనం చేసిన పెద్దలు అటువంటి గొప్పతనాన్ని చాలా విశేషంగా పలికారు.. లోకంలో వ్యవసాయదారులు విత్తనాన్ని నాటడానికి తగిన కాలాన్ని

తెలిసికొని, మంచి ఫలాన్ని ఇవ్వగలిగిన నేలలో విత్తనాన్ని క్రమానుసారంగా నాటితే, అది మంచి పరిపక్వతను పొంది గొప్ప ఫలాన్ని ఇవ్వడం చూస్తున్నాము, ఆ విధంగానే ఆచార్యుడు తాను ఉపదేశించడానికి తగిన సమయాన్ని తెలిసికొని ఉపదేశం పొందడానికి తగిన యోగ్యత కలిగిన శిష్యునకు మోక్షాన్ని ఇవ్వగలిగిన మంత్రాన్ని క్రమం తప్పకుండా ఉపదేశిస్తే, ఆ మంత్రం అతనికి ఇంకా ఇంకా శ్రద్ధను కలిగించి, చివరిలో ప్రపత్తిని ఆచరించేటట్లు చేసి, మోక్షం అనే గొప్ప ఫలాన్ని పొందేటట్లు చేస్తున్నది. అందువల్ల మహా విశ్వాసంతో ప్రపత్తిని చేయడం కొంచెం కఠినమై తోచినప్పటికి, ఆచార్యుడు చేసిన మంత్రోపదేశం క్రమంగా మహా విశ్వాసంతో పాటుగా ప్రపత్తిలో అన్వయాన్ని కలిగించి, ప్రయోజనాన్ని సిద్ధింప చేస్తుంది అనేది వాస్తవం కనుక మంత్రాన్నే ఒకసారి ఉచ్చరించడం అనేది వెంటనే నేరుగా మోక్షాన్ని ఇవ్వగలిగినది కాదు– అని తెలియాలి.

**9) ప్రపత్తి మోక్షానికి సాక్షాత్ కారణం**

*న్యాసః ప్రోక్తోఽ తిరిక్తం తప ఇతి కథితః స్వధ్వర శ్చాస్య కర్తా*

*అహిర్బుధ్న్యే ఽప్యన్వవాదీ దగణి దివిషదా ముత్తమం గుహ్య మేతత్ /*

*సాక్షాన్మోక్షాయ చాసౌ శ్రుత ఇహ తు ముధా బాధశంకా గుణాఢ్యే*

*తన్నిష్ఠో హ్యన్యనిష్ఠాన్ ప్రభు రతిశయితుం కోటికోట్యంశతోఽపి //*

ఇప్పుడు ఇంకొక సందేహం కలుగుతున్నది. ప్రపత్తి మంత్రమైన ద్వయ మంత్రాన్ని జీవుడు స్వయంగా ఉచ్చరించడం అనేది మోక్షానికి సాక్షాత్ కారణం కాదు అని ఈ మంత్రం ఏ విధంగా

అయినా ప్రపత్తిని ఆచరించే టట్లు చేసి, దానిద్వారా మోక్షాన్ని ఇస్తుందని గడచిన లోకంలో చెప్పబడింది కదా ఈ విధంగా అయితే, ప్రపత్తికూడా మోక్షాన్ని నేరుగా ఇవ్వకుండా అది భక్తి యోగాన్ని ఆచరించే టట్లు చేసి, దాని ద్వారానే మోక్షాన్ని ఇస్తున్నది తప్ప,, మోక్షాన్ని నేరుగా ఇవ్వగలిగినది కాదు కదా! అనేది ఆ సందేహం

**వీనికి సమాధానం ఏమంటే –**

ప్రపత్తి మోక్షానికి నేరు కారణంగానే చెప్పబడుతున్నది. అంతేకాక కర్మయోగం, జ్ఞానయోగం, భక్తి యోగం అనే మిగిలిన ఉపాయాల కంటే ప్రపత్తి చాలా గొప్పది అని ఉపనిషత్తు స్పష్టంగా పలుకుతున్నది. ఇంతేకాక ప్రపత్తిని చేసినవానిని గొప్ప యజ్ఞం చేసినవానినిగా వేదం పొగడుతున్నది. ఈ విషయాన్ని అనుసరించే అహిర్బుధ్న్యుడు అనే శివుడు కూడా తన సంహితలో ప్రపత్తి చేసినవానిని చాలా గొప్ప యజ్ఞం చేసిన వానినిగా కీర్తించాడు. ఇంతేకాక, ఉపనిషత్తు వ్యాస విద్యను వివరించే సమయంలో ఈ ప్రపత్తి విద్యను దేవతలకు కూడా తెలియడానికి సాధ్యంకాని చాలా గొప్పది అయిన రహస్యంగా తెలిపింది. ఈ విధంగా మోక్షానికి సాక్షాత్తు కారణంగానూ, మిగిలిన అన్ని ఉపాయాల కంటే చాలా గొప్పది గాను ఉపనిషత్తులలో, సంహితలలో పొగడబడి, ఇంకా అనేక విధాలైన గొప్పతనాలను కలిగిన ప్రపత్తి గొప్పతనాన్ని తక్కువగా చేస్తూ చేసే వాదాలు, ప్రపత్తి ఫలించడంలో సందేహంతో పలికే మాటలు అన్ని వ్యర్థమైన వాదాలు కాగలవు. ఏ విధంగాను ప్రపత్తి గొప్పతనాన్ని

తక్కువ చేయడం సాధ్యం కాని పని. ఇటువంటి ప్రపత్తిని చేసినవానికి కల గొప్పతనంలో కోటి కోటి అంశాలలో ఒక్క భాగం కూడా మిగిలిన ఉపాయాలు చేసేవారుపొందలేరు అని అంటూ ప్రపన్నుల గొప్పతనం శ్రీపాంచరాత్రంలో చాలా విస్తృతంగా చెప్పబడింది.

అయితే, ఉపనిషత్తులు ఓంకారాన్ని మంత్రంగా చేసికొని ఆత్మను భగవంతుని సన్నిధిలో సమర్పించే ప్రపత్తిని చేసే విధానం చెప్పబడింది కదా! ప్రణవాన్ని చెప్పడానికి తగిన యోగ్యత లేనివారు ఏ విధంగా ఆ ప్రణవాన్ని ఉచ్చరించే ప్రపత్తిని చేయగలరు? అనే సందేహం కలుగవచ్చు.
దానికి సమాధానం ఏమంటే

అటువంటివారు ఆగమాలు తెలిపే రీతిలో ద్వయం మొదలైన మిగిలిన వాక్యాలతో ప్రపత్తిని చేయవచ్చు అని శాస్త్రం అవకాశం ఇచ్చింది.
ప్రపత్తి వేదం లో విధింపబడినది అయితే వేదంలో అధికారం లేనివారు ఏ విధంగా ప్రపత్తిని చేయడానికి తగిన వారు? అనే సందేహం కూడా కలుగవచ్చు. వేదంలో చెప్పబడిన సత్యం చెప్పడం మొదలైనవి సామాన్య ధర్మాలై, అన్ని జాతుల వారికి చెందినవి అయినట్లే, ప్రపత్తి కూడా సాధారణమైనది, అందటికీ చెందినదై, అన్ని జాతుల వారు చేయడానికి తగినది గానే అవుతున్నది.

## 10) ప్రపత్తి ప్రత్యేకమైన ఉపాయం

*నానాశబ్దాదిభేదాదితి తు కథయతా సూత్రకారేణ సమ్యక్*

*న్యాసోపాసే విభక్తే యజనహవనవచ్ఛబ్దభేదా దబాక్తాత్ /*

*ఆఖ్యారూపాదిభేదః శ్రుత ఇతరసమః కిం చ భిన్నో ఽధికారః*

*శీఘ్రప్రాప్త్యాదిభిః స్యాజ్జగురితి చ మధూపాసనాదౌ వ్యవస్థామ్ //*

ఇప్పుడు ఇంకొక ఆక్షేపం వస్తున్నది. పూర్వం చెప్పబడిన ప్రపత్తి వైభవాన్ని మేము అంగీకరిస్తాం. అయితే గీతాభాష్యంలో చరమ శ్లోకాన్ని వ్యాఖ్యానం చేసేటప్పుడు ప్రపత్తిని భక్తి యోగానికి అంగంగా చెప్పి వివరించినందున ఆ అంగ ప్రపత్తికి సంబంధించినదే ఇప్పుడు తెలిపిన గొప్పతనం. ఇంతేకాక, శ్రీభాష్యంలో బ్రహ్మ విద్యను వివరించే పదకొండవ పాదంలో మోక్షానికి సాక్షాత్తు ఉపాయంగా ప్రపత్తిని చెప్పలేదుకదా! భక్తియోగం వలె ప్రపత్తి కూడా మోక్షానికి ప్రత్యేకమైన ఒక ఉపాయం అనేదానికి సాక్ష్యంగా ఏ ఆధారము కనిపించడం లేదే! అనేది ఆక్షేపం.

దీనికి సమాధానం ఏమంటే—

బ్రహ్మ సూత్రాలలో బ్రహ్మసూత్ర కారులైన వ్యాసభగవానులు సద్విద్య, దహర విద్య, వైశ్వానర విద్య మొదలైన బ్రహ్మవిద్యలు ఒకదాని కంటే ఇంకొకటి వేరే అని నిరూపించే టప్పుడు, ఒక్కొక్క విద్యలోనూ భగవానుని ఒక్కొక్క గుణాన్ని లక్ష్యంగా చేసుకొని, ఆయా గుణంతో కూడిన భగవంతుని ఉపాసించవలసి ఉన్నందున, ఆ విధంగా విధించే విధి వాక్యాలు మొదలైనవి వేరువేరుగా ఉంటాయి

కనుక ఆ యా విద్యలు వేరు వేరు అని తెలియజేశారు. ఆ వాక్యాలలోని క్రియా పదాలు అన్నీ "ఉపాసించడం" అనే ఒకే అర్థాన్ని చెప్పినప్పటికీ, చెప్పబడిన ఆయా గుణాలతో కూడిన భగవంతుని ఉపాధి విధించే వాక్యాలు ఆయా గుణాలలోని భేదం చేత వేరుగా ఉంటాయి అనేది లక్షణ విధానం కదా. అయితే శరణు పొందడాన్ని సూచించే క్రియాపదం భక్తియోగాన్ని విధించే క్రియ కంటే భిన్నంగా ఉండడానికి ముఖ్యమైన శక్తియే ఉన్నది.

యాగం, హోమం, దానం మొదలైన పదాలు వేరు వేరు కార్యాలను బోధించేటట్లు "భక్తిని ఆచరించు, ప్రపత్తిని ఆచరించు" అని బోధించే పదాలు కూడా ఏ విధమైన కష్టం లేకుండా నేరుగానే భక్తిని ప్రతిపత్తిని మోక్షానికి నేరు కారణాలుగా తెలుపుతున్నాయి. అందువల్ల బ్రహ్మవిద్యలలో ఒకటయిన న్యాస విద్య అనే ప్రపత్తి భక్తియోగం వలె మోక్షానికి నేరుగా సాధనమనే అభిప్రాయంలోనే వ్యాసభగవానుడు వేరు వేరు క్రియా పదాలతో బ్రహ్మ విద్యలు వేరు వేరు అవుతున్నాయని సూత్రీకరించాడు. ఇంతేకాక, భక్తి యోగంలో సద్విద్య దహరవిద్య మొదలైన నామాలలోని భేదంతో ఆయా విద్యలు వేరు వేరు అయినట్లే, ఇక్కడ కూడ న్యాథ విద్య అనే ప్రత్యేకమైన పేరు ఉన్నందున ప్రపత్తి భక్తి యోగం వలే ప్రత్యేకమైన మోక్ష సాధన మని తెలుస్తున్నది. భక్తి యోగంలోని ఒక్కొక్క విద్యలోనూ వాటి కోసం ఏర్పడిన ఆయా గుణాలతో పరమాత్మను ఉపాసించే వలసి ఉన్నందున, ఆయా విద్యలలో రూపం కూడా వేరు

వేరుగా ఉంటుంది. ప్రపత్తి లో కూడా అభయాన్ని ఇవ్వగలిగిన వాడై, కరుణను పూర్ణంగా కలిగిన వాడైన భగవంతుని ఇంకొక ఉపాయాన్ని ఎదురు చూడకుండా మోక్షాన్ని ఇచ్చి రక్షించగలవాడని అనుసంధించి భరన్యాసాన్ని చేయాలి గనుక, ప్రపత్తిరూపంకూడా భిన్నమైనది అవుతున్నది. ఇంతేకాక, భక్తి యోగానికి వర్ణాశ్రమ ధర్మాలను ఆచరించడం మొదలైనవి అంగాలు అవుతున్నాయి. ప్రపత్తికి అయితే ఆనుకూల్యసంకల్పం మొదలైనవి అంగాలు అవుతున్నాయి. అందువల్ల భక్తికి, ప్రపత్తికి అంగాలు వేరువేరుగా ఉన్నాయి. ఈ విధంగానే ఇంకా పలు విధాలైన తేడాలు ఈ రెండిటి మధ్య ఉన్నాయి. ఇంతేకాక, భక్తిని, ప్రపత్తిని ఆచరించడానికి తగిన యోగ్యతలను విచారించినా వాటి మధ్య ఉండే తేడా వ్యక్తమవుతుంది. భక్తి యోగాన్ని చేయడానికి కావలసిన యోగ్యత ఏమంటే ఫలాన్ని ఇవ్వడం ఆరంభించిన కర్మలను వాటి ఫలాలు అన్ని అనుభవించి ఆ తరువాత మోక్షం పొందాలనే ఆశయే యోగ్యత. ప్రపత్తి చేసేవానికి అయితే ఆ శరీరం చివరలో గాని ఇంకా ముందుగానే కోరిన సమయంలో గాని మోక్షాన్ని పొందాలనే ఆశయే యోగ్యతఅవుతున్నది. ఈ విధంగా ఆచరించే వానికి యోగ్యత కూడా భిన్నంగా ఉన్నది. భక్తి యోగంలో సద్విద్య, మధు విద్య మొదలైన వానికి యోగ్యతను విధించి నిర్ణయించేటప్పుడు, కొన్ని విద్యలు కాలం గడిచి, మరి కొన్ని విద్యలు తొందరగాను ఫలాన్ని ఇవ్వడాన్నిబట్టి, ఆయా ప్రయోజనాలను కోరేవారు దానికి తగిన విద్యను ఉపాసించాలి అనే నియమాన్ని చెప్పినట్లే, ఇక్కడ కూడా

భక్తియోగం, ప్రపత్తి– అనే ఈ రెండిటికీ యోగ్యతను శాస్త్రాలు నిర్ణయించాయి. ఇందువల్ల భక్తియోగం వలె ప్రపత్తి కూడా ప్రత్యేకమైన విద్యగా, నేరుగా మోక్షానికి కారణం అవుతున్నది అని తెలియాలి. గీతా భాష్యంలో ప్రపత్తిని భక్తి యోగానికి అంగంగా చెప్పినదానిని ఆధారంగా చేసుకొని ప్రపత్తి స్వతంత్రంగా మోక్షాన్ని ఇవ్వలేదు అని భావించకూడదు. ప్రపత్తి భక్తికి అంగంగా కూడా ఉంటుంది. స్వతంత్రమైన భక్తియోగం వలె మోక్షానికి నేరు కారణంగా కూడా అవుతుంది. ఈ విధంగా ప్రపత్తికి రెండు విధాలైన స్వభావాలు ఉన్నాయి. రెండు స్వభావాలను కల ఒకదానికి, ఒక చోట ఒక స్వభావాన్ని మాత్రం పలికితే, దానిని ఆధారంగా చేసికొని ఇంకొక స్వభావం లేదని భావించకూడదు కదా. అంతేకాక శరణాగతి గద్యలో శ్రీరామానుజులు ప్రపత్తి మోక్షానికి నేరు కారణం అని స్పష్టంగా తెలియజేశారు.

### 11) ప్రపత్తి అంగాలను కలిగినది

*యత్ కించిద్రక్షణీయం తదవననిపుణే న్యస్యతో ऽకించనస్య*
*ప్రస్పష్టం లోకదృష్ట్యా వ్యవగమిత ఇహ ప్రార్థనాద్యంగయోగః।*
*తస్మాత్ కర్మాంగకత్వం వ్యపనయతి పరాపేక్షణాభావవాదః*
*సాంగే త్వష్టాంగయోగవ్యవహృతినయతః షడ్విధత్వోపచార॥*

గడచిన శ్లోకంలో ప్రపత్తి భక్తి యోగానికి అంగం మాత్రమే అనే వాదాన్ని ఖండించి భక్తి యోగం వలె ప్రపత్తి కూడా స్వతంత్రమైన ఉపాయమై, మోక్షాన్ని ఇవ్వగలిగినది అని నిరూపింపబడినది ఇక్కడ

మళ్ళీ ఇంకొక ప్రశ్న తలెత్తుతుంది. ప్రపత్తికి అంగాలుగా ఐదు చెప్పబడినవి కదా. అవి ఎందుకు? ప్రపత్తి వేరు దేనినీఎదురు చూడదు అనే మాట ఉన్నది కదా ! అనేది ఇక్కడ ప్రశ్న.

దీనికి సమాధానం ఏమంటే

తన వద్ద ఉండే వస్తువును రక్షించుకోలేని వ్యక్తి ఒకడు దానిని రక్షించగలిగిన ఇంకొక ని దగ్గర దాచి పెడతాడు. అప్పుడు సొత్తు కలవాడు దాచే వాని దగ్గర ఆ వస్తువును రక్షించడంలో తనకు శక్తి లేదనే విషయాన్ని తెలియజేస్తాడు తెలియజేసి దానిని రక్షించమని ప్రార్థిస్తాడు అందువల్ల ఆ వస్తువు అతని వద్ద పెట్టడం మాత్రమే చాలదని దానికి తోడు కొన్ని పనులను చేయవలసి ఉంటుందని తెలుస్తున్నది ఈ లౌకిక విధానంవల్ల తన ఆత్మను భగవంతుని సన్నిధిలో సమర్పించడం అనే ప్రపత్తిలో కూడా కొన్ని అంగాలు ఉన్నాయి అని తెలుస్తున్నది కదా. ఇంతేకాక, శాస్త్రాలు కూడా ప్రపత్తికి కొన్ని అంగాలను స్పష్టంగా తెలియజేశాయి. ప్రపత్తి వేరు దేనిని ఎదురు చూడదు అనే వచనానికి అర్థం వేరు. ఆ మాటకు —ప్రపత్తి తనకు ఉండే 5 అంగాలను తప్ప, భక్తియోగం వలె, కర్మయోగాన్ని కానీ, వర్ణాశ్రమ ధర్మాలను కానీ అంగాలుగా కోరదు— అనే అర్థం తప్ప, ప్రపత్తి కి అసలు ఏ అంగమే లేదు అని అర్థం కాదు.

ఇప్పుడు ఇంకొక ప్రశ్న ఏర్పడుతుంది. కొన్నిచోట్ల శరణాగతి ఆరు విధాలు అని చెప్పబడినది కదా. అందువల్ల ఆనుకూల్య సంకల్పం మొదలైన అయిదు, ప్రపత్తి —అనే ఆరు కలసి ఇహ ఒకటిగానే కారణమై ఫలాన్ని ఇస్తున్నవి అని తెలుస్తున్నది కదా. ఈ

విధంగా అంగాలు, అంగి అనే క్రమానికి ఎక్కడ అవకాశం లేదే ?అనేది ఆ ప్రశ్న.

దీనికి సమాధానం ఏమంటే–

భక్తియోగం అష్టాంగ యోగం అని చెప్పబడుతున్నది. దానికి ఎనిమిది అంగాలు కల భక్తి యోగం అని అర్థం. భక్తికి ఎనిమిది అంగాలు లేవు. ఏడు అంగాలు మాత్రమే ఉన్నాయి. భక్తి అంగి అవుతున్నది. అందువల్ల ఏడు అంగాలు భక్తి అనే అంగి కలసి ఎనిమిది అంగాలు కల భక్తియోగం అని చెప్పబడుతున్నది. ఆ విధంగానే ఇక్కడ కూడా, ఐదు అంగాలు, ప్రపత్తి అనే అంగి అనే ఈ ఆరు కలసి, శరణాగతి ఆరు విధాలైనది అనే వచనానికి అర్థాన్ని గ్రహించాలి అందువల్ల వాస్తవంలో ఐదు అంగాలను కల ప్రపత్తి ఒకటే అని అవుతున్నది.

**12) అంగాలు, అంగి అనే క్రమంలో కలిగే సందేహం, దానికి సమాధానం**

*పంచాప్యంగాన్యభిజ్ఞాః ప్రణిజగు రవినాభావభాంజి ప్రపత్తేః*
*కైశ్చిత్ సంభావితత్వం యదిహ నిగదితం తత్ ప్రపత్త్యుత్తరం స్యాత్ |*
*అంగేష్వంగిత్వవాదః ఫలకథన మిహ ద్విత్రిమాత్రోక్తయశ్చ*
*ప్రాశస్త్యం తత్ర తత్ర ప్రణిదధతి తతః సర్వవాక్యైకకంఠ్యమ్ ||*

ఇంతకుముందు శ్లోకంలో ప్రపత్తిలో ఇవి అంగాలు, ఇవి అంగి అని నిరూపింపబడినది. ఈ విషయంలో ఏర్పడే కొన్ని చిన్న చిన్న సందేహాలు ఇక్కడ తీర్చబడుతున్నవి.

ప్రపత్తి కి 1) ఆనుకూల్య సంకల్పం, 2) ప్రాతికూల్య వర్జనం, 3) కార్పణ్యం, 4) మహా విశ్వాసం, 5) గోప్తృత్వవరణం అనే అయిదు అంగాలు చాలా ముఖ్యమైనవి అని, ఇవి లేకపోతే ప్రపత్తి అనే అంగి ఫలించదని ప్రపత్తి శాస్త్రాన్ని చక్కగా తెలిసినవారు నిర్ణయించారు. ఇదే నిజమైన విధానం సరి అయిన విధానం.

కొందరు ఈ అయిదు అంగాలు తప్పకుండా ఉండాలి అనే నిర్బంధం లేదని, ఏదో కొన్ని అంగాలు ఉంటే అవే చాలు అని, వాటివల్లనే ప్రపత్తి ఫలిస్తుందని అంటున్నారు, మీరు ఈ విధంగా పలకడం ప్రపత్తి చేసిన తర్వాత ఉండే స్థితికి తగినది. అంటే, ప్రపత్తిని చేసి తర్వాత అంగాలలో ఒకటో, రెండో లేకపోయినా అంతకుముందు చేసిన ప్రపత్తికి ఏ కొరత రాదు. ఉదాహరణకు ప్రాతికూల్యవర్జనం అనే అంగం భగవంతుని అభిప్రాయానికి వ్యతిరేకంగా ప్రవర్తించక పోవడాన్ని తెలుపుతుంది.. ప్రపత్తిని చేసేటప్పుడు దుష్కార్యాలను చేయకుండా ఉండి తీరాలి. లేకపోతే ప్రపత్తి ఫలించదు. తరువాత ఆ విధంగా చెడ్డ పనులను చేయడం సంభవిస్తే దానివల్ల చేసిన ప్రపత్తి కి కొరత కలుగదు. అయితే భగవంతుని మనసు కోపిస్తుంది. అందుకోసం ఏదైనా తగిన ప్రాయశ్చిత్తాన్ని చేసుకుని తీరాలి. అందువల్ల ప్రపత్తి చేసేటప్పుడు మాత్రం అయిదు అంగాలు ఉంటేనే ఆ ప్రపత్తి ఫలిస్తుందని తెలియాలి.

ఈ విధంగానే, మహా విశ్వాసం లేకపోతే ప్రపత్తి ఫలించదు అని ఒక వచనం ఉన్నది. దానికి కూడా, ప్రపత్తి చేసే సమయంలో మహావిశ్వాసం లేకపోతే ఆ ప్రపత్తి ఫలించదు అనేదే అభిప్రాయం.

తరువాత మహా విశ్వాసం ఉన్నప్పటికీ అది ముందు చేసిన ప్రపత్తికి అంగం కాదు. అందువల్ల తరువాత మహా విశ్వాసం లేకపోయినా, దానివల్ల ముందు చేసిన ప్రపత్తికి లోటు లేదు అని గ్రహించాలి.

ఈ విధంగానే, ప్రపత్తి చేసిన తరువాత ఇంకొక ఉపాయాన్ని చేయకూడదు, ఆ విధంగా చేస్తే, బ్రహ్మాస్త్రం ఏ విధంగా ఇంకొక అస్త్రాన్ని అంగీకరించదో, ఆ విధంగానే, ప్రపత్తి కూడా సహించ కుండా వ్యర్థమై పోతుంది అని అనడంలో అభిప్రాయం ఏమంటే —ప్రపత్తిని ఒక ప్రయోజనం కోసం చేసి, తరువాత ఇంకొక ఉపాయాన్ని అదే ఫలం కోసం చేస్తే ఆ ప్రపత్తి దానిని సహించదు, అది వ్యర్థమైపోతుంది అనే అర్థం. అయితే, ప్రాప్తికి తర్వాత ఏర్పడే పాపానికి ప్రాయశ్చిత్తంగా మళ్లీ ప్రపత్తిని చేయడ అది అడ్డుకోదు. ప్రపత్తికి తరువాత చేసిన పాపం తొలగిపోవడానికి ఈ ప్రపత్తి చేయబడుతున్నది. ఈ ప్రపత్తికి ప్రాయశ్చిత్త ప్రపత్తి అని పేరు.

ఇక్కడ ఇంకొక ప్రశ్న ఏర్పడుతున్నది. కొన్ని వచనాలు గోప్తృత్వవరణం అనే అంగాన్ని, మరి కొన్ని వచనాలు మహావిశ్వాసం అనే అంగాన్నే ప్రపత్తి అనే అంగంగా చెబుతున్నాయి కదా. ఇంతేకాక, మరి కొన్ని వచనాలు అంగాన్ని చేస్తేనే ఫలం లభిస్తుంది అని పలుకుతున్నాయి, ఇంకా కొన్ని వచనాలు ప్రపత్తికిరెండు, మూడు అంగాలను మాత్రం చెప్పి ఊరుకున్నాయే! అనేది ఆ ప్రశ్న.

దీనికి తగిన సమాధానం ఏమంటే—

ఈ మూడు విధాలైన పక్షాలు ఆయా అంగాలకు ఉండే గొప్పతనాన్ని పొగడడం కోసం కొంచెం అధికంగా పలికినవే అవుతున్నాయి. అందుచేత అన్ని వాక్యాలు ప్రపత్తికి అయిదు అంగాలు ఉండడం ఏకగ్రీవంగా పలుకుతున్నాయి అని గ్రహించాలి.

మళ్లీ ఇంకొక సందేహం ఇక్కడ అ ప్రస్తావింపబడుతున్నది. ఆనుకూల్య సంకల్పం అంటే ఏమి? నీ మనసుకు నచ్చిన పని చేస్తాను—అని నిశ్చయించుకోవడంకదా. ఇది ప్రపత్తి కి మొదటి అంగం కదా. నిశ్చయించుకోవడం అంగం అంటే నిశ్చయించుకున్న విషయాన్ని చేయడం అంగంగా కదా అవుతున్నది. అందువల్ల ప్రపత్తి కాలంలో అనుకూలంగా ప్రవర్తించడం అంగంగా కదా అవుతున్నది. ఇది ప్రపత్తి హకి తరువాత కూడా ఉండాలి కదా! అనేది ఆ ప్రశ్న.

దీనికి తగిన సమాధానం ఏమంటే—

శాస్త్రం ఆనుకూల్యసంకల్పాన్ని అంగంగా తెలుపుతున్నది. తప్ప సంకల్పించినట్లుగా చేయడం అంగంగా చెప్పలేదు. ఈ విధంగా ఉండగా, అనుకూలంగా చేయడం, అంటే, నిశ్చయించుకున్నాహ కార్యాన్ని అంగంగా కల్పించి పలకడం సరికాదు. అందుచేత మధ్యాహ్నం ప్రపత్తి చేసిన తరువాత కూడా ఈ అనుకూలంగా వర్తించడం అంగంగా అనువర్తిస్తుంది అనేది తగదు. అయితే

నిశ్చయించుకోవడం అనే ఆనుకూల్యసంకల్పం ప్రపత్తిని చేసేటప్పుడు పాప కార్యాలను చేయకపోవడానికి పనికి వస్తున్నది.

మళ్లీ ఇక్కడ ఇంకొక విషయం ప్రపత్తితోపాటు కామ్యకర్మలు, పాప కర్మలు కలిసి నట్లయితే, ప్రపత్తి నిష్ఠ నశిస్తుంది అనే వచనం ఉన్నది, దీనికి, ప్రపత్తి చేసే కాలంలోనే కామ్యకర్మలు, పాప కర్మలు చేయడం తటస్థిస్తే ప్రపత్తి నిష్ఠ పాడైపోతుంది అనే అర్థమే తప్ప, ప్రపత్తి ఫలించిన తరువాత సంభవించే కామ్యకర్మలు వల్ల, పాప కర్మల వల్ల ఆటంకం కలుగుతుంది అని అర్థం కాదు. ఇక్కడ అ నిష్ఠ తగ్గిపోతుంది అని అంటే ప్రపత్తి నిష్ఠ నశిస్తుంది అని అర్థం కాదు శాస్త్రాలు ప్రపత్తిని చేసినవానికి ఒక మధ్యస్థితిని విధించాయి. ఆ స్థితి ఏమంటే– ఇతర ఫలాలను ఇచ్చే కామ్యకర్మలను, పాప కృత్యాలను విడిచిపెట్టి, నిత్య నైమిత్తిక కర్మలను ఆచరించడంలో ఆసక్తి కలిగి ఉండడమే. కామ్యకర్మలను కానీ, పాప కృత్యాలను కానీ ప్రపత్తికి తరువాత చేసేవానికి పూర్వం పల్కిన స్థితి లేకుండా పోతుంది కదా. ఆ కర్మల వల్ల ఆ స్థితి లేకుండా పోయినా, దానివల్ల ముందు ఫలించిన ప్రపత్తికి కొరత కలుగదు. అయితే, భగవంతునకు మనసులో కలత కలుగుతుంది. అది తీరడం కోసం మాత్రం ప్రాయశ్చిత్త రూపంగా ప్రపత్తిని చేయమని శాస్త్రం విధించింది. అది ఫలం కోసం మళ్లీ చేసే ప్రపత్తి కాదు. దానివల్ల ముందు చేసిన ప్రపత్తికి లోపం రాదు. ఈ విధంగా ప్రమాణాలను అనుసరించి అన్ని వాక్యాలకు ఏ విధమైన విరోధం లేకుండా ఏక కంఠంగా అర్థాన్ని గ్రహించి విషయాన్ని నిర్ణయించుకోవాలి.

### 13) ప్రపత్తి లక్షణాన్ని గూర్చిన విచారణ

*రక్షాపేక్షా స్వసాహ్యప్రణయవతి భరన్యాస ఆజ్ఞాదిదక్షే*

*దృష్టా నాఽత్ర ప్రపత్తివ్యవహృతి రిహ తన్మే ళనే లక్షణం స్యాత్ /*

*గేహాగత్యాదిమాత్రే నిపతతు శరణాగత్యభిఖ్యోపచారాత్*

*యద్వా ఽనేకార్థభావాద్భవతి హి వివిధః పాలనీయత్వహేతుః //*

ప్రపత్తి యొక్క స్వరూపం ఏది? ఈ శబ్దం ముఖ్యార్థంగా దేనిని తెలుపుతుంది? ఉపచార క్రమంలో దేనిని తెలుపుతుంది? అనే అంశాలను ఏ సందేహం లేకుండా నిర్ణయించడం కోసం ప్రపత్తి లక్షణం ఈ శ్లోకంలో విచారింప బడుతున్నది.

లోకంలో ఒక మానవుడు తన దగ్గర ఉండే ఒక వస్తువును కాపాడడం కోసం ఇతరుని సహాయం ఆవశ్యకం అని భావించి, అతని దగ్గరకు వెళ్లి తన వస్తువును తాను కాపాడుకోవడంలో సహాయం చేయమని ప్రార్థిస్తున్నాడు. అయితే దానిని రక్షించే బాధ్యత పూర్తిగా అతడు ఇతరుని వద్ద పెట్టడం లేదు. అతని చేసే ఆ ప్రార్ధనను శరణాగతి అని లోకంలో చెప్పడం లేదు.. ఇంతేకాక, ఒక పెద్దమనిషి తన పనిమనిషికి ఆజ్ఞాపించి అహ తన బాధ్యతను అంతటినీ అతనికి అప్పగిస్తున్నాడు. లేక, ఒకనికి కూలి ఇచ్చి తన బాధ్యతను అప్పగిస్తున్నాడు. ఇవి కూడా శరణాగతి అని చెప్పడం లేదు. అందువల్ల ప్రార్థించడం మాత్రమే, లేక బాధ్యతను అప్పగించడం మాత్రమే ప్రత్యేక ప్రత్యేకంగా శరణాగతి అని అనడం లేదు అని తెలుస్తున్నది. అయితే, ఆ రెండు కలసినప్పుడు అదే నిజమైన

శరణాగతి అవుతున్నది. అంటే, తనను రక్షించవలసినది అని ప్రార్థించి, తన బాధ్యతను ఒకని వద్ద సమర్పించడమే నిజమైన శరణాగతి అవుతున్నది. ఈ రెండు చేరినపుడే ప్రపత్తి యొక్క స్వరూపం సిద్ధిస్తుంది.

అయితే, కాకాసురుడు రాముని వద్దకు వచ్చి చేరడం, వేటగాడు ఆడ పావురాన్ని పట్టుకుని మగ పావురం ఉండే చోటకు వచ్చి చేరడం మొదలైన చోట్ల శరణాగతి సహజమైనదిగా చెప్పబడుతున్నది. ఇక్కడ ప్రార్థించడం, బాధ్యతను అప్పగించడం అనేవి కనబడడం లేదే? అనే సందేహం కలుగవచ్చు.

దీనికి సమాధానం ఏమంటే—

ఈ సందర్భాలలో శరణాగతి యొక్క స్వరూపం పూర్తిగా లేకపోయినా, కాపాడేవాడు ఉండేచోటుకు వచ్చి చేరడం మొదలైనవానిని మాత్రం దృష్టిలో పెట్టుకొని శరణాగతి అనే మాట ఉపచార వచనంగా ప్రయోగింపబడినదని చెప్పవచ్చు. లేక, శరణం అనే పదానికి గృహం, రక్షించేవాడు ఉపాయం అనే విధంగా చాలా అర్థాలు ఉన్నాయి కనుక, శరణాగతి అనే పదానికి ఇంటికి చేరడం అనే అర్థాన్ని గ్రహించి, ఉపచార వచనంగా కాకుండా ముఖ్యార్థం గానే నిర్వహించవచ్చు. లోకంలో ఒకనిని కాపాడడానికి పలు కారణాలు ఉంటాయి. తన ఇంటికి రావడం, అంజలి చేయడం నోటితో ప్రార్థించడం మొదలైన వేరు వేరు కారణాల వల్ల ఇతరులను రక్షించడం లోకంలో చూస్తున్నాము. ఈ కృత్యాలన్ని లోకంలో ఉండే ధర్మిష్ఠులు

తమ వద్దకు వచ్చిన వారిని లోకరీతిలో కాపాడడానికి సాధనమైన శరణాగతియే అవుతున్నవి.. మోక్షం కోసం భగవంతుని పాదాలలో చేయవలసినదిగా శాస్త్రం విధించిన శరణాగతి గాని, రక్షించమని ప్రార్థించి తన బాధ్యతను అంతటినీ సమర్పించడం కానీ అవి అవుతున్నవి అని తెలియాలి.

**14) శేషత్వజ్ఞానం అన్ని అవస్థలలోను అనువర్తించడం**

*ఆత్మాత్మీయస్వరూపస్యసన మనుగతం యావదర్థం ముముక్షోః*
*తత్త్వజ్ఞానాత్మకం తత్ ప్రథమ మథ విధేః స్యాదుపాయే సమేతమ్ /*
*కైంకర్యాఖ్యే పుమర్థేఽప్యనుషజతి తదభ్యర్థనాహేతుభావాత్*
*స్వాభీష్టానన్యసాధ్యావధి రిహ తు భరన్యాసభాగోంఽగిభూతః //*

గడచిన శ్లోకంలో అన్నివిధాలైన ప్రపత్తులకు సాధారణమైన రూపం తెలుపబడింది. లౌకికమైన సంగాన్ని విడిచి, మోక్షం కోసం చేసే అన్ని ధర్మాలలో "సహజంగా తాను భగవంతునకు శేషమైనవాడు" అనే భావం ఉండాలి. ఇప్పుడు మోక్షం కోసం చేసే ప్రపత్తిలో ఆ శేషత్వ భావన ఉండాలి అనే విశేషమైన అంశం ఇక తెలుపబడుతున్నది.

మోక్షాన్ని కోరేవాడు తన శరీరం, ఆత్మ, తాను చేసే ఉపాయం, పొందే ఫలం, తన పుత్రులు, భార్య మొదలైన అన్ని విధాలైన సంపదలను భగవంతుని సన్నిధిలో సమర్పించాలి. అంటే, తాను తనకు చెందినవి అన్ని వస్తువులు ప్రమాణానుసారంగా ఏమి ఉన్నాయో వాటిని అన్నిటిని సహజంగా భగవంతునకు శేషమైనవి

అనే భావనను కలిగి ఉండాలి. ఈ అనుసంధానం పారలౌకిక మైన ప్రయోజనం కోసం చేసే అన్ని ధర్మాలకు ఆవశ్యకమైనది ఈ భావన తిరుపతికి ముందు తప్పకుండా ఉండవలసినది అయితే మొదట ఉండే ఈ భావన శాస్త్రాల ద్వారా ఉపదేశాల ద్వారా కలిగినదిగా, సాధారణమైనదిగా ఏర్పడిన తత్వ్వజ్ఞాన రూపంలో ఉంటుంది.

ఈ భావన అనువర్తించి, ప్రపత్తి చేసేటప్పుడు కూడా అనువర్తించి ఉంటుంది. మోక్షాన్ని కోరి చేసే అన్ని ధర్మాలకు కూడా ఈ భావన సాధారణం కనుక, ప్రపత్తి లో కూడా అనువర్తించి ఉండాలి కదా. ప్రపత్తి కాలంలో ఈ అనుసంధానం కావాలి అని శాస్త్రం విధిస్తున్నది. అందువల్ల ఈ భావన ప్రపత్తి చేసేటప్పుడు దాని రూపంలోనే చేరి ఉంటుంది.

ప్రపత్తికి తర్వాత ఈ లోకంలో ఏ ప్రయోజనాన్ని ఎదురు చూడకుండా కైంకర్యాలను చేసేటప్పుడు, మోక్షంలో నిరంతరం కైంకర్యాలను చేసేటప్పుడు కదా అనుసంధానం ఉండాలి. ఎందుకంటే, కైంకర్యం సిద్ధించాలని ప్రార్థించడానికి "తాను, తనకు సంబంధించినవి భగవానునికి శేషం" అనే భావన కదా కారణం అవుతున్నది. ఇదే స్వరూప సమర్పణం అని అనబడుతున్నది.

ఈ విధంగా తనతో పాటు, తనకు సంబంధించినవానిని అన్నిటిని భగవంతునకు శేషం అని భావించినట్లే, ప్రపత్తిలో అంగి అయిన భరన్యాసాన్ని చేసేటప్పుడు తనకు చెందిన వానిని అన్నిటినికూడా కలుపు కోవాలా? అనే సందేహం కలుగుతుంది. అది ఆ విధంగా అక్కరలేదు. ఆ విధంగా కలుపుకోకపోవడం తన

మనోరథానికి తగినదే. అంటే, వేరొకరి వల్ల, ఇంకొక ఉపాయం వల్ల పొందడానికి సాధ్యం కానిది, తాను కోరినది అయిన ఫలం ఏదో, దానిని గూర్చిన బాధ్యత మాత్రమే సమర్పించాలి, ఇదే అంగి అయిన భరన్యాసం అని అనబడుతున్నది. లోకంలో కూడా ఇతరుల దగ్గర నుండి ఒక ప్రయోజనాన్ని పొందాలని కోరేవాడు తాను కోరిన ప్రయోజనం యొక్క పరిమితికి తగినట్లుగా కదా బాధ్యతను ఉంచుతాడు. స్వరూపాన్ని భగవంతుని వద్ద సమర్పించేటప్పుడు మాత్రమే తనను, తనకు చెందినవానిని అన్నిటిని సమర్పించాలి

**15) " సర్వధర్మాన్ పరిత్యజ్య" అనే పదానికి ఆరు అర్థాలు**

*న్యాసాదేశేషు ధర్మ త్యజనవచనతోఽకించనాధిక్రియోక్తా*

*కార్పణ్యం వాఽఙ్గముక్తం భజనపదితరాపేక్షణం వాఽప్యపోఢమ్ /*

*దుఃసాధేచ్ఛేద్యమౌ వా క్వచిదుపశమితావన్యసంమేళనే వా*

*బ్రహ్మాస్త్రన్యాయ ఉక్త స్తదిహ న విహతో ధర్మ ఆజ్ఞాదిసిద్ధః //*

అన్నిటినీ చేయగలిగిన శక్తిని కల భగవంతుని వద్ద తన రక్షణబాధ్యతను సమర్పించడం అనే ప్రపత్తిని చేయడానికి సిద్ధపడినవాడు అన్ని ధర్మాలను విడిచిపెట్టాలని చరమ శ్లోకం మొదలైనవి విధిస్తున్నవికదా! అందువల్ల సంధ్యావందనం మొదలైన వర్ణాశ్రమ ధర్మాలు అయిన అజ్ఞా కైంకర్యాలను, వాటిలో చేరిన మాలికా సమర్పణం, దీపారోపణం మొదలైన అనుజ్ఞాకైంకర్యాలను చేయకుండా విడిచిపెట్టాలి అనే అర్థం వస్తున్నదే? అనే సందేహం ఇక్కడ ఏర్పడుతున్నది.

దీనికి తగిన సమాధానం ఏమంటే—

సర్వ ధర్మాలను విడువడం ప్రపత్తికి అంగమని ఎక్కడా చెప్పబడలేదు. సర్వ ధర్మాలను ప్రపత్తికి అంగంగా కూడా ఎక్కడా చెప్పలేదు. "సర్వధర్మానలను విడిచిపెట్టి" అనేదానికి ఏ ప్రమాణానికి విరుద్ధంగాని ఎన్నో అర్థాలను చెప్పడానికి వీలు ఉండగా, వాటికి విరుద్ధమైన అర్థాన్ని కల్పించడం సరికాదు.

" సర్వ ధర్మాలను విడిచిపెట్టి" అనే ప్రయోగానికి సరి అయిన అర్థాలు ఆరు ఉన్నవి. అవి ఏవి ?అంటే,

1) భక్తియోగం మొదలైన పేరు ఉపాయాలను చేయడంలో యోగ్యత లేనందున అకించనుడవైన నీ స్థితిని తెలిసి, వేరు ఏ ఉపాయాన్ని చేయడంలో ఆశ లేకుండా ఉండే నీవు— అని ఒక అర్థం. దీనివల్ల ఆకించన్యం అనే యోగ్యత ప్రపత్తికి ఆవశ్యకం అని చెప్పబడింది.

2) వేరు ఉపాయం అనే ఏ గతి లేకపోవడాన్ని (ఆకించన్యాన్ని) అనుసంధిస్తూ— అని ఇంకొక అర్థం. లేక, ఏ గతి లేనందువల్ల పూర్వం తనకు కల గర్వాన్ని పోగొట్టుకొని— అని ఇంకొక అర్థం. లేక, భగవంతునకు కరుణ కలిగేటట్లు తక్కువగా ఉండి— అని మరి ఒక అర్థం.

3) భక్తి యోగంలో వర్ణాశ్రమ ధర్మాలు అంగంగా ఉండేటట్లు, ప్రపత్తిలో కూడా అవి ప్రసక్తం కాగా, దానికి చెప్పబడిన అయిదు అంగాలు తప్ప ఇక వేరు ఏ అంగం లేదు కనుక, ప్రపత్తికి అంగంగా ఏ ధర్మాన్ని ఆచరించకుండా విడిచిపెట్టి —అని ఇంకొక అర్థం.

4) నీచే చేయడానికి సాధ్యం కాని ఉపాయాలను చేయడానికి ఆరంభించి, "మెల్ల మెల్లగా ఈ కార్యాన్ని సాధిస్తాను" అనే ఆశనం విడచిపెట్టి– అని ఇంకొక అర్థం.

5) నీవు చేయడానికి సాధ్యం కాని భక్తి యోగం మొదలైనవానిని చేయాలని చాపల్యంతో నీవు పడే వ్యర్థమైన శ్రమను విడిచిపెట్టి –అని ఇంకొక అర్థం.

6) ప్రపత్తిని చేసేటప్పుడు అందులో నమ్మిక తగ్గి, వేరు ఇంకొక ఉపాయాన్ని చేయడానికి ఆరంభిస్తే, బ్రహ్మాస్త్ర ప్రభావంలో సందేహం కలిగి వేరు దారాలతో రాక్షసులు హనుమంతుని కట్టినట్లు, అది ఉపయోగం లేకుండా పోతుంది– అనేదానిని తెలిసికొని, ఇక ఏ ఉపాయాన్ని చేయకుండా విడిచిపెట్టి– అని ఇంకొక అర్థం.

ఈ విధంగా అన్ని ధర్మాలను విడిచి పెట్టడాన్ని తెలిపే ఈ ప్రయోగానికి అన్ని ప్రమాణాలకు విరుద్ధం కాకుండా ఉండే విధంగా అర్థాలు ఉన్నప్పుడు, ప్రమాణాలకు విరుద్ధంగా అర్థాలను చెప్పడం సరికాదు, అందువల్ల ప్రపత్తిని చేసే వాడు ఆజ్ఞాకైంకర్యాలను, అనుజ్ఞా కైంకర్యాలను చేయాలి అనే సిద్ధాంతానికి ఏ అడ్డు లేదు.

## 16) ప్రపత్తి ఉపాయం కాదు అనే వాదాన్ని ఖండించడం

*ఆదేష్టుం స్వప్రపత్తిం తదనుగుణగుణాద్యన్వితం స్వం ముకుందో*
*మామిత్యుక్త్వైకశబ్దం వదతి తదుచితం తత్ర తాత్పర్య మూహ్యామ్ /*
*తత్ప్రాప్య ప్రాపకైక్యం సకలఫలదతాం న్యాసతోఽన్యానపేక్షాం*
*ప్రాధాన్యాద్యం చ కించిత్ ప్రథయతి స పరం శ్రీసఖే ముక్త్యుపాయే //*

ఇంతవరకూ ప్రపత్తి యొక్క స్వరూపం, అది అంగి అనే విషయం, దానికి అంగాలు ఉన్నాయి అనే విషయం మొదలైనవి తెలుపబడ్డాయి కదా. ప్రపత్తి అనేది ఒక ఉపాయం అనే విషయం సిద్ధిస్తే కదా అది అంగి అని, దానికి కొన్ని అంగాలు ఉన్నాయని చెప్పడానికి వీలవుతుంది. ప్రపత్తి ఉపాయం అనే విషయం సిద్ధించలేదే! పలు వాక్యాలు శరణు పొందడానికి తగిన వాడైన భగవంతుని ఉపాయంగా తెలుపుతున్నాయి. ఇంత మాత్రమేనా? అతడు ఒక్కడే ఉపాయం అని, ఇంకొక ఉపాయం లేదని కూడా తెలిపే "ఏకం" అని మొదలైన విశేషణాలతో ప్రపత్తి ఉపాయం కాదనే విషయం తెలుపబడుతున్నది కదా. అందువల్ల ప్రపత్తిని ఒక ఉపాయంగా భావించి ఇంతకుముంద పలికిన విషయాలన్నీ ఎంత మాత్రం సమంజసం కాదు– అనేది ఒక ఆక్షేపం.

దీనికి సమాధానాన్ని ఈ శ్లోకం తెలుపుతున్నది. దీని వివరం ఈ విధంగా గమనించవచ్చు.

శ్రీకృష్ణుడు ఇహలోకపరలోక ప్రయోజనాలను అనుగ్రహించే స్వామి. అతడు తనను ఉద్దేశించి ప్రపత్తిని చేయమని చరమశ్లోకంలో విధించాడు. అప్పుడు తాను ఉపాయం కావడానికి కావలసిన అన్ని గుణాలతో కూడి ఉన్న విషయాన్ని "మామ్" అనే పదంతో సూచించాడు. తరువాత ఏకం అనే పదంతో తనను ఒక్క ని మాత్రమే ఉపాయంగా గ్రహించమని చెప్పాడు ఈ ఏకశబ్దానికి స్పష్టమైన అర్ధాన్ని గ్రహించి తెలియాలి. ప్రపత్తిని కూడా ఉపాయంగా

కలిగే వచనాలు కూడా ప్రమాణాలే కదా వాటికి విరుద్ధం కాని విధంగా ఏకశబ్దానికి అర్ధాన్ని ఊహించి పలకాలి. ఈ ఏక శబ్దానికి ఆరు అర్థాలు చెప్పబడుతున్నాయి. వాటి వివరాన్ని ఈ క్రింది విధంగా చెప్పవచ్చు.

1) లోకంలో ప్రయోజనం వేరు, దాని కోసం చేసే ఉపాయం వేరుగా ఉంటాయి. ఇక్కడ లక్ష్మి తో కూడిన భగవంతుడు ఒక్కడే ఉపాయంగా, ప్రయోజనంగా అవుతున్నాడు అనే విషయాన్ని "ఏకం" అనే పదం తెలుపుతున్నది జీవుడు తాను ఆచరించే ప్రపత్తిని సర్వేశ్వరునితో సమానంగా భావించకుండా, భగవంతుడే ఉపాయంగాను, ప్రయోజనంగాను అవుతున్నాడు అని భావించాలి అని తెలుస్తున్నది.

2) ఆయా ప్రయోజనాల కోసం అనేక విధాలైన ఆయా కర్మలను చేసి, శ్రమపడవద్దు– అని, ప్రపత్తికి వశమైన తాను ఒక్కడే అవి ఇచ్చే అన్ని ప్రయోజనాలను అనుగ్రహించే విషయాన్ని ఏకం అనే పదం తెలుపుతున్నది.

3) వేరు ఉపాయాలను చేయడానికి శక్తి లేక ప్రపత్తినే చేసిన జీవుని విషయంలో భగవంతుడు ప్రపత్తిని తప్ప వేరే ఏ ఉపాయాన్ని ఎదురు చూడకుండా, తాను ఒక్కడే స్వయంగా నిలచి ఫలాన్ని ఇస్తాడు అనే అర్థాన్ని ఏకం అనే పదం తెలుపుతున్నది.

4) ప్రయోజనాన్ని ఇచ్చే భగవంతుడు ఉపాయం అయినట్లే ఆ ఉపాయాన్ని చేసే తాను కూడా ఒక ఉపాయం అని భావించకుండా,

భగవంతుడు ఒక్కడే ముఖ్యమైన ఉపాయమని జీవుడు తెలియడంకోసం ఏకం అనే పదం ప్రయోగించబడింది.

5) ప్రపత్తి మానవుడు చేసే ప్రయత్నం వల్ల సాధింప బడుతున్నది కనుక సాధ్యోపాయం అని అనబడుతుంది. భగవంతుడు ఆ విధంగా కాకుండా ఇంతకుముందే ఉండే ఉపాయం కనుక సిద్ధోపాయం అనబడుతున్నాడు. అతడు ఒక్కడే ముఖ్యమైన ఉపాయం. ప్రపత్తి అతనికి కలిగే కోపాన్ని తీర్చి జీవునకు ఫలం ఇచ్చేటట్లు చేస్తున్నది. ఇది ముఖ్య ఉపాయమైన భగవంతునితో చేర్చి లెక్కించ కూడదు. కనుక అతడు ఒక్కడే ముఖ్యమైన ఉపాయం అనే విషయాన్ని ఏకం అనే పదం తెలుపుతున్నది.

6) ఇంకా, ఈ విధంగానే, ప్రపత్తికి చెప్పబడిన అయిదు అంగాలనే కాక వేరు అంగాలనుకూడా చేయవలసిన అవసరం లేదు కనుక, వేరు ఏ అంగాలను ఎదురు చూడకుండా ఐదు అంగాలతో కూడిన ప్రపత్తి తో కలసి తానొక్కడే ఫలాన్ని భగవంతుడు ఇస్తాడనే విషయాన్ని ఏకం అనే పదం తెలుపుతున్నది.

అందువల్ల, భగవంతుడు తనను ఒక్కనే శరణు పొందే విధంగా పలికిన దానికి తగినట్లు ప్రమాణాలను అనుసరించి ఇటువంటి తగిన అర్థాలు ఉన్నాయి. కనుక, ప్రపత్తి భగవంతునకు జీవుని విషయంలో ఉండేది కలతను పోగొట్టే ఉపాయమై ఉండడాన్ని ఈ ఏక శబ్దం అడ్డు కోదు అని తెలియాలి.

## 17) సిద్ధో పాయం, సాధ్యోపాయం, వానివరణం

*స్వాభీష్టప్రాప్తిహేతుః స్వయమిహ పురుషైః స్వీకృతః స్యాదుపాయః*
*శాస్త్రే లోకే చ సిద్ధః స పునరుభయధా సిద్ధసాధ్యప్రభేదాత్ /*
*సిద్ధోపాయస్తు ముక్తౌ నిరవధికదయః శ్రీసఖః సర్వశక్తిః*
*సాధ్యోపాయస్తు భక్తి ర్న్యాసనమితి పృథక్ తద్వశీకారసిద్ధ్యై //*

ఇంతకు ముందు చెప్పిన విషయాలను స్థిర పరచడం కోసం సామాన్యంగా ఉపాయం అనే పదంలోని అర్థం, సిద్ధం, సాధ్యం అనే రెండు విధాలైన దాని విభాగాలు, దాని వల్ల వచ్చే ప్రయోజనం ఈ శ్లోకంలో వివరింపబడుతున్నాయి.

ఈ ప్రపంచంలో జీవుడు ఒక ప్రయోజనాన్ని పొందాలని అనుకుంటే దానిని పొందడానికి తగిన సాధనాన్ని ఆచరించాలి. అదే ఉపాయం అనబడుతుంది. ఈ విషయాన్ని శాస్త్రం తెలుపుతున్నది ఇది లోకరీతి లో కూడా ఉన్నది. ఈ ఉపాయం సిద్ధోపాయం, సాధ్యోపాయం అని రెండు విధాలు. మానవుని చేత ఆచరింపబడవలసిన అవసరం లేకుండానే ముందే ఉండే ఒక సాధనం సిద్ధోపాయం అనబడుతుంది. మానవుడు ప్రయత్నం చేసి సాధించవలసిన ఉపాయం సాధ్యోపాయం అని చెప్పబడుతోంది. మోక్షాన్ని పొందడం కోసం ఉపాయాన్ని చేసేవానికి భగవంతుడు సిద్ధోపాయం అవుతున్నాడు. అతడు జీవునిచే చేయబడవలసిన అవసరం లేకుండానే ముందుగానే ఉన్నాడు అతడు అంతులేని కరుణను కలవాడై. అన్నిటినీ చేయగలిగిన శక్తిని కలవాడై. లక్ష్మీదేవితో నిత్య సంబంధాన్ని కలవాడై. జీవునకు మోక్షం

ఇస్తున్నాడు. అందుచేత అతడు సిద్ధో పాయం అవుతున్నాడు. భక్తియోగం, ప్రపత్తి అనేవి ప్రత్యేకమైన సాధ్యోపాయాలు. ఇవి మానవునిచే చేయబడవలసినవి కనుక సాధ్యో పాయాలు అనబడుతున్నాయి. ఈ రెండిటిలో ఏదో ఒక దానిని చేస్తే వచ్చే ఫలం ఏమి? జీవుడు చేసిన పాపాలవల్ల భగవంతునకు అతని విషయంలో కోపం కలుగుతున్నది. ఈ సాధ్యోపాయాన్ని చేస్తే భగవంతునకు కోపం తీరి జీవునకు వశం అవుతున్నాడు. జీవుని విషయంలో అతనికి ఉండే కోపం తీరి ప్రయోజనాన్ని ఇస్తున్నాడు. ఈ విధంగా భగవంతుని కోపం తీరడమే సాధ్యోపాయం వల్ల కలిగే ఫలం అని తెలియాలి.

### 18) అంగాలతో కూడిన ప్రపత్తి, దాని అనుసంధానమ్

*అత్యంతాకించనోఽహం త్వదపచరణతః సన్నివృత్తోఽద్య నాథ*
*త్వత్సైవైకాంతధీః స్యాం త్వమసి శరణమిత్యధ్యవస్యామి గాఢమ్ ।*
*త్వం మే గోపాయితా స్యా స్త్వయి నిహితభరోఽస్మ్యేవమిత్యర్పితాత్మా*
*యస్మై స న్యస్తభారః సకృదథ తు సదా న ప్రయస్యేత్ తదర్థమ్ ॥*

ఇంతకుముందు అంగాలతో స్థాపింపబడిన భరన్యాసాన్ని క్రమపద్ధతిలో చేయడం కోసం వేరు విధంగా ఈ శ్లోకంలో బోధించాలని భావించి, ఒకసారి చేసిన తర్వాత ఇంక చేయవలసినదానిలో మిగిలినది ఏమీ లేదు అనే సంగతి తెలుపబడుతున్నది. అయిదు అంగుళాలలతో కూడిన ప్రపత్తిని చేయవలసిన క్రమం ఏమంటే—

నేను ప్రపత్తిని తప్ప ఇంకొక ఏ ఉపాయాన్ని చేయగలిగిన శక్తిని కల వాడను కాను. (ఇది కార్పణ్యం అనే అంగం) . నీ మనసుకు విరుద్ధమైన పనులను చేసి అపచార పడను. (ఇది ప్రాతికూల్య వర్జనం). నీకు సంతోషం కలిగించే సేవను చేయడంలోనే ఆసక్తిని కలిగి ఉన్నాను. (ఇది ఆనుకూల్య సంకల్పం) నీవు నన్ను తప్పకుండా కాపాడగలవుఅనే నమ్మికతో ఉన్నాను. (ఇది ఇది మహా విశ్వాసం) నీవు నాకు ఉపాయంగా కావాలి. (ఇది గోప్తృత్వవరణం) . నన్ను రక్షించే బాధ్యతను, నా స్వరూపాన్ని నీ సన్నిధిలో సమర్పిస్తున్నాను. (ఇది అంగి అయిన ప్రపత్తి)

ఈ విధంగా అయిదు అంగాలతో కూడిన ప్రపత్తిని భగవంతుని సన్నిధిలో ఏ ప్రయోజనాన్ని కోరి ఒక పర్యాయం చేస్తున్నాడో ఆ ప్రయోజనం కోసం మళ్ళీ ఇంకొకసారి అతడు ఏ కాలంలోనూ ప్రయత్నాన్ని చేయకూడదు. ఒక ప్రయోజనం కోసం ఒకసారే ప్రపత్తిని చేయాలి. భక్తియోగం ఫలాన్ని పొందేవరకు చిరకాలం చేయవలసి ఉన్నది. కానీ ఇది ఆ విధంగా కాకుండా ఒక్కసారి మాత్రమే చేయవలసినదిగా ఉన్నది. ఆ విధంగా ఒక సారి చేసిన తర్వాత దానికోసం ఇక అతడు చేయవలసినది ఏమీ లేదు.

## 19) ప్రపన్నుడు ఉండవలసిన క్రమం

*త్యక్త్వోపాయానపాయానపి పర మజహన్మ ధ్యమాం స్వార్థవృత్తిం*
*ప్రాయశ్చిత్తం చ యోగ్యం విగతఋణతతి ర్ద్వంద్వవాత్యాం తితిక్షుః /*

*భక్తిజ్ఞానాదివృద్ధిం పరిచరణగుణాన్ సత్సమృద్ధిం చ యుక్తామ్*
*నిత్యం యాచేదనన్య స్తదపి భగవత స్తస్య యద్వా౭౭౭ప్తవర్గాత్//*

చేతనుడు పూర్వం తెలిపిన విధంగా ప్రపత్తిని చేసిన తరువాత తాను గడిపే జీవితంలో తన యోగ్యతకు తగినట్లు వేనిని విడిచిపెట్టాలి? శాస్త్ర విధి లో చెప్పబడిన ఏ కార్యాన్ని చేయాలి ?వేటిని భావించాలి?వేటిని ప్రార్థించాలి? అనే విషయాలు సంగ్రహంగా ఈ శ్లోకంలో, సంగ్రహంగా చెప్పబడుతున్నాయి.

ప్రపత్తిని చేసిన తరువాత మోక్షాన్ని తప్ప ఇక ఏ ప్రయోజనాన్ని ఇచ్చే కర్మలను చేయకూడదు పాపాన్ని కలిగించే కర్మలను చేయకూడదు. ఈ రెండు విధాలైన కర్మలలో చేరనివి, మధ్యలో ఉండేవి సంధ్యావందనం, శ్రాద్ధం మొదలైన నిత్య నైమిత్తిక కర్మలు. ముందు తెలిపిన రెండు వర్గాలలోనూ చేరని వీటిని చేతనుడు తన కర్తవ్యంగా భావించి తప్పక చేయాలి. ఇదే మధ్య స్థితి. దీనిని ఏనాడు విడువకూడదు. ప్రపత్తిని చేసిన తరువాత సంభవించే పాపాలకు తగినట్లు శాస్త్రాలు తెలిపే విధంగా ప్రాయశ్చిత్తాన్ని విడవకుండా చేయాలి. అటువంటి ప్రాయశ్చిత్తాన్ని చేయలేని పపన్నునకు ప్రపత్తియే తగిన ప్రాయశ్చిత్తమని విధింపబడినది దీనిని తప్పక చేయాలి.

ఇంతేకాక మానవునకు మూడు ఋణాలు చెప్పబడ్డాయి దేవ ఋణం, ఋషి ఋణం, పితృ ఋణం అనేవి ఈ మూడు, ఈ ఋణాలలో మొదటి ఋణాన్ని యజ్ఞ యాగాలు చేయడం ద్వారా, రెండవ ఋణాన్ని వేదాన్ని అధ్యయనం చేయడం ద్వారా, మూడవ

ఋణాన్ని గృహస్థాశ్రమం నిర్వహించి పుత్రులను పొందడం ద్వారా తీర్చుకోవాలి అని శాస్త్రం తెలుపుతున్నది. ప్రపత్తి చేసినవాని విషయం వేరు. అతనికి అతడు భగవంతుని వద్ద చేసిన ప్రపత్తి చేతనే ఈ ఋణాలు అన్ని తీరి పోతున్నాయి. ఇంతేకాక, దేవపూజ, యాగం మొదలైనవి ఇతడు మధ్య స్థితిలో ఉండి చేసే కార్యాలలోనే అంతర్భవించే కైంకర్యాలు అవుతున్నాయి అందుచేత ఇతడు ప్రపత్తి యొక్క మహిమ చేత అన్ని ఋణాలను తీర్చుకున్న వాడు అవుతాడు.

ఇంతేకాక, ప్రపన్నునకు ఈ లోక జీవనంలో సుఖం, దుఃఖం కలిగి సుడిగాలివలె ఇతనిని బాధిస్తాయి ఇందుకోసం మనసులో కలత చెందకుండా ఓర్పుతో వాటిని సహించాలి. వాటి అనుభవాన్ని ఇవ్వడం ఆరంభించిన తన ప్రాప్తకర్మలను అనుభవించి, ఏ ఆటంకం లేకుండా కైంకర్యాలను చేయగలుగుతాముకదా! అని ఆనందించాలి. వేరు ఏ ప్రయోజనాన్ని అన్వేషించకుండా, భక్తి, జ్ఞానం మొదలైనవి ఇంకా ఇంకా అభివృద్ధి కావాలని భగవంతుని వద్ద, అతనికి అంతరంగులు అయిన విష్వక్సేనుడు, అనంతుడు, గరుడుడు మొదలైనవారి వద్ద, ఆళ్వారులు, నాథమునులు, ఆళవందార్, శ్రీరామానుజులు మొదలైన ఆచార్యుల వద్ద ప్రార్థనను ఎప్పుడూ చేయాలి. కైంకర్యానికి సాధనమైన చందనం, పుష్పం మొదలైనవాని సమృద్ధిని, ఫలంలో సంగం లేని స్వభావం మొదలైనవానిని అనుగ్రహించమని అర్థించాలి. తన కైంకర్యానికి ఉపయోగించే విధంగా సాదుసమృద్ధిని ప్రార్థించవచ్చు. ఇది కూడా తన కైంకర్యానికి

ఉపయోగ పడకపోతే ఇతడు ప్రార్థించకూడదు. అన్య దైవాల వద్ద గాని, వారి దాసుల వద్ద గాని భక్తి మొదలైనవానిని కూడా యాచించ కూడదు

**20) ప్రపన్నుడు కోరినప్పుడు మోక్షాన్ని పొందడం**

*ఆజ్ఞాకైంకర్యవృత్తిప్వ నఘగురుజనప్రక్రియానేమివృత్తిః*
*స్వార్హానుజ్ఞాతసేవావిధిషు చ శకనే యావదిష్టం ప్రవృత్తః /*
*కర్మ ప్రారబ్ధకార్యం ప్రపదనమహిమధ్వస్తశేషం ద్విరూపం*
*భుక్త్వా స్వాభీష్టకాలే విశతి భగవతః పాదమూలం ప్రపన్నః //*

ఇంతకుముందు ప్రస్తావన చేసిన ప్రపన్నునకు అతడు కోరిన సమయంలో ముఖ్య ఫలమైన మోక్షం లభించడం ఇక్కడ తెలుపబడును తున్నది.

ప్రపన్నుడు చేసే కైంకర్యం అజ్ఞాకైంకర్యం, అనుజ్ఞా కైంకర్యం అని రెండు విధాలు.

అజ్ఞా కైంకర్యం అంటే— భగవంతుని ఆజ్ఞ అయిన శాస్త్రాలచేత విధింపబడిన కర్మలు. ఇవి, స్నానం, సంధ్యావందనం, భగవంతుని ఆరాధన, తర్పణం, శ్రాద్ధం మొదలైనవి. శక్తి కలవాడు వీటిని చేయకపోతే పాపం వస్తుంది. ఇవి ప్రపత్తికి అంగం కాకపోయినా వర్ణాశ్రమ ధర్మాలు కనుక వీటిని చేసి తీరాలి. ఈ కైంకర్యాలను ఏ దోషం లేనివారైన ఆచార్యులు ఆచరించిన క్రమాన్ని అనుసరించి చేయాలి.

అనుజ్ఞాకైంకర్యం ఏమంటే —చేయకపోతే పాపం రానిది, చేస్తే భగవంతునకు ముకఖోల్లాసాన్ని కలిగించేది అయిన కైంకర్యం. చందనం, పూలు మొదలైన వానిని సమర్పించడం, ప్రదక్షణం చేయడం, ఉత్సవ వాదులను చేయడం మొదలైనవి ఇందులో చేరుతాయి. వీటిని తన శక్తికి, కోరికకు తగినట్లు చేయవచ్చు.

జీవుని కర్మలు సంచితం అని, ప్రారబ్ధం అని రెండు విధాలు. వీటిలో, సంచితం అంటే— తరువాత పరిణతిని చెందే స్థితిలో ఫలాన్ని ఇవ్వగలిగిన, పోగుపడిన కర్మలు. ప్రారబ్ధం అంటే —ఫలాన్ని ఇవ్వడం ప్రారంభించిన కర్మలు. ప్రపత్తి చేసినవానికి మొదటి వర్గం అయిన సంచిత కర్మలు అన్ని ప్రపత్తిమహిమ వల్ల తీరిపోతాయి. ప్రారబ్ధ కర్మలలో మరుజన్మను కలిగించి అందులో ఫలాన్ని ఇవ్వగలిగిన కర్మల భాగం అంతా ప్రపత్తియొక్క మహిమ వల్ల తీరిపోతుంది. ఈ శరీరం ఉన్నంతవరకు ఫలం అనుభవించ వలసిన కర్మల భాగం మాత్రమే మిగిలి ఉంటుంది ఇది కూడా పుణ్యం పాపం, అని రెండు విధాలు, వీటి ఫలాన్ని అంతటిని ప్రపన్నుడు ఈ శరీరం ముగిసే లోపల అనుభవిస్తాడు అందువల్ల అతని అన్ని కర్మలు శరీరం విడిచే కాలంలో తీరిపోతాయి. తరువాత తాను కోరిన సమయంలోనే, అంటే, ఈ శరీరం తీరిన సమయంలోనే పరమపదాన్ని చేరి, భగవంతుని చరణాలను సమీపించి, నిత్యకైంకర్యాలను చేసికొంటూ ఆనందాన్ని అనుభవిస్తాడు.

## 21) ఫలశ్రుతి

*శ్రుత్యా స్మృత్యాదిభిశ్చ స్వయ మిహ భగవద్వాక్యవర్గై శ్చ సిద్ధాం*
*స్వాతంత్ర్యే పారతంత్ర్యేఽప్యనితరగతిభిః సద్భి రాస్థీయమానామ్ /*
*వేదాంతాచార్య ఇత్థం వివిధగురుజనగ్రంథసంవాదవత్యా*
*వింశత్యా న్యాసవిద్యాం వ్యవృణుత సుధియాం శ్రేయసే వేంకటేశః //*

ఉన్నత ప్రయోజనమైన మోక్షాన్ని భగవంతుని విషయంలో చేసే ప్రపత్తి ఇస్తుంద. ఇది, ప్రమాణాలను పురస్కరించుకొని, దీనికి కల గొప్పతనాన్ని పురస్కరించుకొని, దీనిని గూర్చి ప్రవచనం చేసే మన పూర్వాచార్యులను పురస్కరించుకొని మిగిలిన ఉపాయాల కంటే దీనికి ఉండే గొప్పతనాన్ని వ్యక్తం చేసి, ప్రపత్తిని గూర్చిన ఈ గ్రంథం రచించడం లో గల ప్రయోజనం ఈ శ్లోకంలో తెలుపబడుతున్నది.

భగవంతుని సన్నిధిలో ప్రపత్తి చేస్తే మోక్షాన్ని పొందవచ్చు అనే విషయాన్ని ఉపనిషత్తులు తెలుపుతున్నాయి. ఇంకా స్మృతులు, ఇతిహాసాలు, పురాణాలు, ఆగమాలు మొదలైనవి కూడా ఎన్నో చోట్ల ఈ విషయాన్ని తెలుపుతున్నాయి, మనకు మంచిని చేసే భగవంతుడే పలుచోట్ల ఈ ప్రపత్తి యొక్క గొప్పతనాన్ని గూర్చి పలికాడ. ప్రపత్తిని తప్ప ఇంకొక ఉపాయాన్ని ఆచరించని మన ఆళ్వారులు, నాథమునులు, యామునులు, శ్రీరామానుజులు మొదలైన పూర్వాచార్యులు దీనిని గూర్చి లోకానికి ప్రవచనం చేసి, తాము ఆచరించి చూపించారు, దీనిని మోక్షానికి నేరు ఉపాయంగా కూడా ఆచరించవచ్చు. భక్తి యోగానికి అంగంగాకూడా

చేయవచ్చు. శ్రీరంగనాథునిచే వేదాంత చార్యులు అనే బిరుదాన్ని అనుగ్రహింపబడిన వేంకటే కవి పలువురు పూర్వాచార్యులు శ్రీ సూక్తులైన స్తోత్రరత్నం, గద్యత్రయం మొదలైన గ్రంథాలను అనుసరించి ప్రపత్తి విద్యను గూర్చి 20 లోకాలను కల న్యాసవింశతి అనే ఈ గ్రంథంలో మంచి జ్ఞానాన్ని పొందినవారు ఇహలోక పరలోక ప్రయోజనాలను పొంది ఆనందించడం కోసం వివరించి పలికారు.

**22) ప్రపన్నుడు అనుసంధించవలసిన క్రమం**

*సంసారావర్తవేగప్రశమనశుభదృద్దేశికప్రేక్షితోఽహమ్*
*సంత్యక్తోఽన్యైరుపాయై రనుచితచరితేష్వద్య శాంతాభిసంధిః/*
*నిఃశంక స్తత్త్వదృష్ట్యా నిరవధికదయం ప్రార్థ్య సంరక్షకం త్వాం*
*న్యస్య త్వత్పాదపద్మే వరద! నిజభరం నిర్భరో నిర్భయోఽస్మి //*

ఇంతకుముందు తెలిపిన ప్రపత్తి అనే ఉపాయాన్ని ఇతరులు సులభంగా తెలుసుకోవడం కోసం తమ ఆచరణ రూపంగా పలికి దేశికులు ఈ స్తోత్రాన్ని పూర్తి చేస్తున్నారు.

.. సదా చార్యుని ఆశ్రయించి సేవించి అతని దివ్య కటాక్షాలను పొందాను. ఆ కటాక్షాలు ఎంతో మంచిని చేస్తాయి కదా. సంసారం అనేది నీటిసుడి చాలా వేగంగా నన్ను కలలోకి ఆకర్షిస్తున్నది ఆ వేగాన్ని ఆచార్య కటాక్షాలు అడ్డుకోగలిగినవి. ఆ కటాక్షాల వల్ల మంచి జ్ఞానాన్ని పొందాను. అయితే భక్తియోగం మొదలైన వేరు గొప్ప ఉపాయాలు నన్ను పూర్తిగా విడచి పెట్టాయి. వాటిని

చేయడానికి తగిన జ్ఞానం. శక్తి నాకు లేనందున మనసులో చాలా బాధపడ్డాను. నాకు చేయడానికి వీలు అయినది, ఒకేసారి చేయవలసినది, సులభమైనది అయిన, ఒక ఉపాయాన్ని విచారించి చూచి, ఆది ఇది ప్రపత్తి అని తెలిసి కొని, అందులో నిష్ఠను కలిగి ఉన్నాను. నా స్వరూపానికి తగని కార్యాలను చేయడం మానుకున్నాను. సులభమైన ఉపాయం అయిన ప్రపత్తి యొక్క స్వరూపాన్ని తెలిసికొన్నాను. దానివల్ల ప్రయోజనం పొందడంలో ఉండే సందేహాలన్నీ తీరినవాడను అయ్యాను. లక్ష్మీదేవిని ఏనాడు విడచి ఉందని నారాయణుని రక్షకునిగా ప్రార్ధించాను. అన్నిటినీ చేయగలవాడు, అంతులేని కరుణను కలవాడు, కోరిన అన్ని ప్రయోజనాలను ఇవ్వగలవాడైన వరదరాజ స్వామి శ్రీ చరణపద్మాలలో నాకు సంబంధించిన అన్ని బాధ్యతలను సమర్పించి, అంగాలతో కూడిన ప్రపత్తిని ఆచరించాను. పొందే ప్రయోజనంలో, వస్తువులలో, కార్యాలలో సంగాన్ని విడిచి పెట్టాను. ఈ విధంగా వరదరాజస్వామి పాదాలలో ప్రపత్తిని చేసినందున నా బాధ్యత అంతటినీ నెరవేర్చుకున్నవాడను అయ్యాను. రక్షకుడైన శ్రీమన్నారాయణుడు నా బాధ్యతను తీసుకున్న విషయాన్ని కూడా గ్రహించాను. ఇక నాకు బాధ్యత అనేది ఏమి లేదు. కర్మలను గురించిన చింత కూడా లేదు. భయం కూడా లేదు. వేరొక ఏ ప్రయోజనాన్ని ఆశించకుండా, చేసేటప్పుడు ఆనందరూపమై ప్రకాశించే కైంకర్యాలను చేస్తూ సుఖంగా ఈ లోకంలో ఉన్నాను.

కవితార్కికసింహాయ కళ్యాణగుణశాలినే,

శ్రీమతే వేంకటేశాయ వేదాంతగురవే నమః.

న్యాసవింశతివివరణం సంపూర్ణమ్

***